సాహిత్య ప్రస్థానం

అక్టోబర్-నవంబర్ 2016

# స్వేచ్ఛాస్వరం ప్రత్యేక సంచిక



**మా**నవ చైతన్య వికాసంలో సాహిత్యం మహత్తర పాత్ర నిర్వహించింది. మూఢత్వాన్ని ఆధిపత్యాన్ని ,పీడనలూ దోపిళ్లను ప్రశ్నించడానికి అక్షరాలా ఆలంబనగా నిలిచింది. ఆశయాలకు వూపిరులూదింది. సంఘ సంస్కరణలోనూ స్వాతంత్ర పోరాటాలలోనూ , విప్లవ విజయాలలోనూ ప్రేరణగా నిలిచింది. ఈ కారణంగానే దేశ దేశాల్లో సాహిత్యకారులు రచయితలు కవులు అనేక నిర్బంధాలనూ నిషేధాలను ఎదుర్కోవలసి వచ్చింది. మన దేశంలోనూ ఇటీవలి చర్చకు వచ్చిన అనేక పరిణామాల నేపథ్యంలో ఉజ్వలమైన ఉత్తేజకరమైన ఈ చరిత్ర మననం చేసుకోవడం అవసరమని భావిస్తున్నాం. ఆలోచనాత్మకమైన ఆచరణకు మార్గదర్శకమైన అక్షర సంపదలు అందించాలనే సంకల్పమే ఈ స్వేచ్ఛాస్వరం. గతంలోని మా ప్రత్యేక సంచికలను మించి ప్రతిష్టాత్మక రచయితలు మేధావుల రచనల సమాహారంగా వెలువడనున్నది. భావప్రకటనా స్వేచ్ఛ అంశంపై విలువైన రచనలకు ఆహ్వానం.

## ప్రకటన కర్తలకు విజ్ఞప్తి

సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచికకు ప్రకటనలు ఇచ్చి ప్రోత్సహించవలసిందిగా ప్రకటనకర్తలకు విజ్ఞప్తి చేస్తున్నాం. ఈ ప్రత్యేక సంచిక ద్వారా మీ ప్రకటన విభిన్న ప్రజానీకాన్ని, విలువైన పాఠకుల్నీ చేరుకుంటుంది. మీ ప్రయోజనం నెరవేరటమే కాదు, ప్రస్థానంలో ప్రకటన ద్వారా తెలుగు భాషా, సాహిత్యాల్ని సుసంపన్నం చేయడంలో మీరూ భాగం పంచుకున్నట్టే. చిరకాలం దాచి వుంచుకోదగిన స్థాయిలో వెలువడుతున్న ఈ ప్రత్యేక సంచికకు మీ నుంచి అదే విధమైన ప్రత్యేకాదరణ లభిస్తుందని ఆశిస్తున్నాం.

\- సాహిత్య ప్రస్థానం

*Account Details:*
A/c Name: **PRASTHANAM**
A/c No. 52001500585
**SBH**, Governorpet, Vijayawada
IFSC : SBHY0020343

***Note:*** Please issue cheque/DD's in favour of **PRASTHANAM**

Add Size: 16.5 cm x 21.5 cm

*సంప్రదించండి:*
27-30-4, యం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు
ఆకులవారి వీధి, గవర్నరుపేట, విజయవాడ-520 002.
ఫోన్: 0866-2577248, 9490099059

**www.prasthanam.com, e-mail: ssprasthanam@gmail.com**

PRSVMORA 172

సాహిత్య ప్రస్థానం ఆగస్టు 2016

సంపుటి : 15 సంచిక : 8

# 'మహా' రచయిత్రికి జోహార్లు

మహాశ్వేతాదేవి మన కాలపు మహోన్నత రచయిత్రి. అట్టడుగు వర్గాల అందులోనూ ఆదివాసుల వాస్తవ స్థితిగతులను కళ్లకు కట్టిన కలం ఆమెది. రవీంద్రనాథ్ ఠాగూర్, శరత్‌బాబు వంటి బెంగాలీ రచయితలు ఆర్‌కె నారాయణ్ వంటి భారతీయాంగ్ల రచయితలు దేశమంతటికీ తెలుసు. వారి రచనల్లో ప్రధానంగా మధ్యతరగతి, బుద్ధిజీవులు, ఉన్నతవర్గాలు కనిపిస్తే మహాశ్వేత అంతకంతకు సమాజపు అట్టడుగు పొరల్లోకి చూపు సారించారు. మౌలికంగా మార్క్సిజం, కమ్యూనిస్టు ఉద్యమం ఆమెకు తొలి ప్రేరణ ఇచ్చాయి. తండ్రి మానిష్ ఘటక్ కవి, బాబాయి ప్రసిద్ధ దర్శకుడు రుత్విక్ ఘటక్ కూడా ప్రజా నాట్యమండలి (ఇప్టా)తో సన్నిహిత సంబంధం కలిగినవారే. భర్త బిజువన్ భట్టాచార్య నాటక రచయిత కాక ఇప్టా కార్యకర్త. ఇలాంటి వాతావరణంలో మహాశ్వేత మలచబడడంలో ఆశ్చర్యం లేదు. ఆదివాసుల మౌఖిక కథనాలకు నమ్మకాలకు కూడా నవలా రూపం ఇవ్వడం ఆమెకే చెల్లింది. శరత్ తర్వాత తెలుగు ప్రజలకు సుపరిచితమైన బెంగాలీ రచయిత్రి ఆమే. ఆ నవలల్లోని దుర్భర వాస్తవికత, భయానక పీడన మామూలు ఊహలకు అందని స్థాయిలో ఉంటాయి. ఈ రచనల కోసం మహాశ్వేత నాగరిక బెంగాలీ భాషను అడవిబిడ్డల మాటలను మేళవించి ఒక ప్రత్యేక శైలిని సృష్టించారని చెప్పాలి. గిరిజనుల్లో తమ వీరుల గురించి పాతుకుపోయిన నమ్మకాలు లాంటివి కూడా ఆమె కథనంలో ఇమిడిపోయాయి. ఆమె కథలు సినిమాలుగా కూడా వచ్చాయి. అనేక పురస్కారాలు, జ్ఞానపీఠం కూడా లభించాయి. మహాశ్వేతా దేవి పశ్చిమబెంగాల్ వామపక్ష ప్రభుత్వం భూసంస్కరణలను మనస్ఫూర్తిగా హర్షించారు. నందిగ్రాం, సింగూరు ఘటనల తర్వాత వామపక్ష ప్రభుత్వంతో విభేదించారు. ఎన్నికల్లో మమతా బెనర్జీ ఇచ్చిన పరివర్తన నినాదాన్ని గట్టిగా బలపరుస్తూ వామపక్షాలకు వ్యతిరేకంగా ప్రచారంలో పాల్గొన్నారు. మమతా బెనర్జీ కూడా అనుకున్న ప్రకారం పనిచేయడం లేదని ప్రశ్నించినప్పుడు అంతా ఒక్క రాత్రిలో జరిగిపోదని వ్యాఖ్యానించే వారు. మొత్తంపైన రచనల పరంగానూ రాజకీయంగానూ ఆమె తనదైన క్రియాశీల పాత్ర వహించడం సాహిత్యజీవులకు మార్గదర్శకం. దళితులు, నిరుపేదలు, వలస కార్మికులు, వ్యభిచార వృత్తిలోని మహిళలు, యువత వంటి వారి హక్కుల కోసం నిలబడడం ఆమెకు గొప్ప స్థానం కల్పించింది. తాను ప్రజల కోసమే రాస్తానని ఆమె ప్రకటించుకున్నారు. జీవిత పర్యంతం ఆ నిబద్ధతతో నిలబడ్డారు. అందుకే ఆమె ప్రజాపక్ష రచయితలకూ ప్రజాస్వామిక భావుకులకూ ఆదర్శప్రాయులు. ఆమెకు ఇదే మా జోహార్లు.

కవర్ డిజైన్ : గిరిధర్

బొమ్మలు : తుంబలి శివాజి, గంగాధర్, మీరా

## ఈ సంచికలో ...



సంపాదకవర్గం

తెలకపల్లి రవి (ప్రధాన సంపాదకుడు)

వొరప్రసాద్ (వర్కింగ్ ఎడిటర్)

కె. సత్యరంజన్ • చీకటి దివాకర్

గనారా • శమంతకమణి

• కెంగార మోహన్

కె.లక్ష్మయ్య, మేనేజర్

మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:
ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం, డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ - 520 002,
సెల్: 9490099059

హైదరాబాద్ చిరునామా
ఎం.హెచ్‌భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020

ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

అమెరికా కవితలు-1

# మాకో పాపా, బాబూ!

- కడియాల రామమోహనరాయ్
9959778698



మాకో పాపా బాబూ!
ఇద్దరూ సాఫ్ట్‌వేరే
ఇద్దరూ అమెరికాయే
పాపేమో చికాకో బాబు  కాలిఫోర్నియా

ఇద్దరికీ ఒక్కొక్కరే పిల్లలూ
అక్షత, అజయ్
ఇద్దరికీ తెలుగస్సలు రాదు
అంతా ఇంగ్లీషే
మేం వెళ్తే మాతోనూ ఇంగ్లీషే
ఒక్క ముక్క తెలిస్తావదు
పాపో, కోడలో వాళ్లేమంటున్నారో చెప్పాల్సిందే

మా పాప ఇంట్లో పూజలూ వ్రతాలూ అన్నీ చేస్తుంది
మా కోడలికి మాత్రం మడీమైలా ఏమీలేవు
మా పాప అక్టోబర్‌లో వచ్చింది
వినాయక సాములారికి బంగారు పాదుకలివ్వటానికి
బాబు కిందటేడాది వచ్చాడు
వచ్చాడేగాని ఎన్నిటూర్లు
వున్న నెలరోజుల్లో ఇరవై రెండు రోజులు అత్తారింట్లోనే
"మీ వాళ్లకు మళ్లీ ఇండియా వచ్చి ఇక్కడే
వుండిపోయే వుద్దేశమేమీ లేదా?"
లేదమ్మా లేదు - ఇక్కడేముంది బూడిద
మేం మాత్రం ఇక్కడికి రావొద్దనే అంటున్నాం
వాళ్లూ రావావలనుకోవటం లేదు
"మరి మీరు?"
మాదేముంది - ఇక్కడే వుంటాం, ఇక్కడే పోతాం
వాళ్లు గొప్పగా వుంటే చాలు.



## జూలై నెల పురస్కారాలు



**ఇద్దరూ ఇద్దరే**
కథకు: రూ.700/-
రచయిత : వి. వెంకట్రావు

**మేల్కొండి మేల్కొండి**
కవితకు : రూ .500/-
రచయిత : శివకోటి నాగరాజు



సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

◆

వ్యాసం : స్త్రీవాద కవిత్వం - బాలికల సమస్యలు రచయిత : చొప్పర శివకుమారి
ఈ రచయితకు 'కర్లపాలెం రుక్మిణమ్మ స్మారక పురస్కారం రూ.500/- అందజేయబడుతుంది

◆

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు.
సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్

# జ్వలిత గోదావరి

- దాట్ల దేవదానం రాజు
9440105987



"ఇప్పటికైనా ఆయిల్ కంపినీవోడు దిగొత్తాడంటావా?"

"నలభై ఏడు రోజుల్నుండి గుడారాలేసుకుని కూచుంటే దిక్కు లేదు. వాళ్ళు గొప్ప ముదుర్లు. ఇలాంటి వాటికి లొంగుతారా? అమాయకత్వం కాకపోతే.." అన్నాడు పినపోతు వీర్రాజు ఆకాశం వైపుకు చూస్తూ.

"ఈ దెబ్బతో వాడి తలలో జేజమ్మ లొంగుతాది. అరవై గ్రామాల పెజల దీచ్చ . గాడిమొగ, పోర, పల్లంకుర్రు, బలుసుతిప్ప, యానాం లోని వారందరి కడుపుమంట పోరాటం ఇది" లంకే రాముడు అన్నాడు.

"ఏనాడైనా విన్నామా... కన్నామా...అయిదొందల బోట్లతో గోదావరి ముట్టడి. నీటి మీద యుద్ధం...చమురు జిడ్డుతో గోదారిని మురికి చేసేత్తున్నారు, నాయాళ్ళు...చేపలకు ఊపిరందడం లేదు....బతికే జాడలు నాశనం చేసేత్తున్నారు...మనల్ని ఎదవల్ని చేసి " మల్లాడి భైరవస్వామి గట్టిగా అరుస్తున్నట్లుగా అంటున్నాడు.

"మనోడు అదే ఎమ్మెల్యేది గట్టి బుర్రరా... పట్టాడంటే వదలడు...ఏది తలపెట్టినా అంతు చూత్తాడు "అన్నాడు ఎర్రజుట్టు నాగేశ్వరరావు.

గోదారి ఒడ్డున గుంపుగా కూర్చున్నారు. ఎడతెగని కబుర్లు, ఇంకా రాని సహచరుల కోసం ఎదురుచూస్తూ.

భైరవపాలెం ఒకరొకరుగా చేరుకుంటున్నారు, రకరకాల మార్గాల్లో. అందరి ముఖాల్లో ఆతురత.

ఉదయం ఎనిమిది గంటలు. మరో అరగంటలో ప్రయాణం.

కోలాహలం పెరిగింది. ఒకటే రొద. అడ్డూ అదుపు లేని మాటల సంరంభం.

గత రెండు రోజులుగా ఆకాశం మేఘాలతో ఆవరించి ఉంది. వర్షం పడుతుందని భయపడ్డారు.

వర్షం వస్తే చాల ఇబ్బంది.అనుకున్నట్టుగా నిరసన సాగదు.

నవంబరు నెల. ఏ రోజు ఎలాగుంటుందో చెప్పలేం.ఒక దశలో బోట్లతో రిగ్గుల ముట్టడిని విరమిస్తే బావుంటుందని ఆలోచన చేసారు.

మర్నాడు ఎండ- వేసవిని తలపిస్తూ. నిరసన యథాప్రకారం జరుగుతుందని ఆటంకం ఉండబోదని నాయకులు ప్రకటించారు. మళ్లీ ఒక సమస్య వచ్చింది.

కలక్టరు అనుమతి ఇవ్వనని భీష్మించుకున్నాడు. ఆఖరి నిముషంలో వాయిదా వేయడం తప్పదేమో అనుకున్నారు.

నాయకులు పరిస్థితి వివరించారు. శాంతియుతంగా జరుగుతుందని హామీ ఇచ్చారు. సమూహంలో అందరి మనస్తత్వాలు ఒకలా ఉండవు. రంగం లోకి దిగాక విధ్వంసమో ప్రశాంతమో ...ఎవరూ చెప్పలేరు. అల్లరి మూకలు చేరి అలజడులు సృష్టించిన సందర్భాలెన్నో. విధ్వంసకరశక్తులు పొంచి ఉంటాయి. అవకాశం కోసం ఎదురుచూస్తుంటాయి. అదమరచి ఉంటే మూల్యం ఎంతైనా చెల్లించాల్సి ఉంటుంది.



గోదావరి నిర్మలంగా ఉంది.జరగబోయే సంఘటనలకు సాక్షిగా గోదావరి.

సముద్రంలో సంగమించే చోట కల్లోలంగా ఉంటుంది. పైగా అమావాస ప్రభావం తప్పక ఉంటుంది. ఉవ్వెత్తున సముద్రకెరటాలు...ఎగసిపడుతుంటాయి. ఎటు చూసినా అనంత జలరాశి.

అయినా నాయకులు తెగించారు. అనుకున్న ప్రకారం ముందుకెళ్ళాలని నిర్ణయించుకున్నారు. జి.ఎస్.పి.ఎస్, రిలయన్స్ లకు వ్యతిరేకంగా నినాదాలు మారుమోగుతున్నాయి.

"జీవనోపాధి కోల్పోతున్న మత్స్యకారులను ఆదుకోవాలి"

"చమురు కంపెనీలు మొండితనం విడనాడాలి "

"ఇక్కడ సంపద కొల్లగొట్టి కోట్లాది రూపాయిలు లబ్ది పొందుతూన్న కంపెనీలు ప్రజల క్షేమం పట్టించుకోవాలి"

"వాగ్దానం చేసిన నిధుల్ని విడుదల చేయాలి"

"తాళ్ళరేవు, కాట్రేనికోన ,ఐ.పోలవరం, ముమ్మిడివరం, కె. గంగవరం, యానాం ఇంకా ఇతర గ్రామాల వారికి నష్టపరిహారం వెంటనే చెల్లించాలి"

నాయకులు ఒడ్డున నిలబడి పాటించాల్సిన జాగ్రత్తలు గురించి చెప్పారు.

"ఈ నవంబరు ఏడు తారీఖు చరిత్రలో నిలిచిపోతుంది. నీటి మీద ధర్నా. గతంలో ఎక్కడా జరగలేదు. మన ప్రాణాలు విలువైనవి. ఆవేశం వద్దు. నాయకులుగా మేం చెప్పినట్లు వినాలి.రిగ్‌ల వద్ద వాతావరణం బీభత్సంగా ఉంటుంది

ఎవరూ తెలిసి పొరబాటు చేయొద్దు.

బ్రాంది, సారాలు తాగిన వారుంటే వెంటనే దిగిపోండి. అలాంటి వారు మీ పక్కన ఉంటే బలవంతంగా దింపేయండి. మొహమాటం వద్దు. సరిపడా మంచినీళ్ళ పాకెట్టులు, ఆహారం పొట్లాలు ఉన్నాయి.కంగారు పడొద్దు. మన నిరసన ప్రభుత్వానికి తెలియాలి. చమురు కంపెనీల మీద ఒత్తిడి పెరగాలి. మన కోరికలు తీరాలి. అదే మన ధ్యేయం. ఎవరికీ నష్టం కలిగించే పనులు చెయొద్దు. అది మన పని కాదు. శాంతియుతంగా పోరాడి జీవనభృతి సాధించుకుందాం" నందగోపాల్ జనాన్ని ఉద్దేశించి మాట్లాడాడు. ఏ నాయకుడు చెప్పినా సారాంశం ఒకటే.

ఐదొందల బోట్లు. రెండువేలకు పైగా నిరసనకారులు. గోదావరి తీరం చేరిన బోట్లు మినీ యుద్ధ టాంకుల్లా ఉన్నాయి. వాటి మీద ఉన్న వారంతా సైనికుల్లా ఉన్నారు.

రంగు రంగుల దుస్తులు.ఫాంట్స్, నిక్కర్లు, లుంగీలు...అలవాటును బట్టి ధరించారు.

సూర్యకిరణాల తాకిడి తగలకుండా నుదుట మీదుగా కళ్ళను కప్పుతూ పలుచని గుడ్డలు చుట్టుకున్నారు. కొంతమందేమో తలపాగాలు....

దైవభక్తి ఉన్నవాళ్ళు ఇంట్లోనూ గుడిలోనూ పూజలు చేసి ఇంతంత బొట్లు పెట్టుకుని వచ్చారు.

నాయకుల సైగ అందుకుని బోట్లు కదిలాయి. గోదావరి ఆకాశంలో క్రమశిక్షణతో ఎగురుతున్న పక్షుల్లా సాగుతున్నాయి.ఉత్సాహంగా కేరింతలు కొడ్తూ ...పాటలు పాడుతూ... డాన్సులు చేస్తూ... జనం హుషారుగా ఉన్నారు.

అందరి లోనూ ఉత్సుకత.ఎదురుచూపు. ప్రయాసతో సాహసంగా చేస్తున్న నిరసన. ఈ ఆందోళన చరిత్ర కాబోతుంది.

గంట ప్రయాణం తర్వాత ప్రధాన అడ్డా వచ్చింది.

నునుపైన మైదానంపై స్కేటింగు చేస్తున్నట్లుగా సాగిన ప్రయాణమల్లా సముద్రం సమీపించగానే కుదుపులకు లోనవుతున్నది. అంతే కాదు-

అల్లంత దూరంలో ఉండగానే తీరప్రాంత గస్తీ దళం అడ్డుకుంది. రిగ్ వద్దకు రావద్దని హెచ్చరికలు చేస్తున్నారు. నిషేధాజ్ఞలు ఉల్లంఘిస్తే తీవ్రమైన చర్యలు తప్పవని మైకుల ద్వారా ఆదేశాలు ఇస్తున్నారు. ఆందోళనకారులు, పోలీసుల మధ్య మాటల యుద్ధం . అంబరాన్ని తాకుతున్న నిరసన గళాలు. ఒక రకమైన తెగింపు.

ఉన్నట్టుండి పెద్ద శబ్దం. జోరుగా హోరుమని చెవులు

గింగిర్లుమనేంత చప్పుడు. భూమి కంపించినట్టు నీటి ప్రకంపనాలు. బోట్లు కదిలిపోతున్నాయి. అటూ ఇటూ ఊగిసలాడుతున్నాయి. హాహాకారాలు మిన్ను ముట్టాయి. మినీ నౌక నిండా తుపాకులు ధరించి అప్రమత్తంగా గస్తీ పోలీసులు. రింగ్ చుట్టూ వేగంగా తిప్పుతూనే ఉన్నారు. భయకంపితుల్ని చేయాలనే ఎత్తుగడ.



భయంకరమైన హోరు... నీటిని కోస్తూ గింగిరాలు తిరుగుతున్న తీరు...గుండెలు గుభేలుమంటున్నాయి.

నందగోపాల్ పరిస్థితిని అంచనా వేస్తున్నాడు. మైకు తీసుకున్నాడు. అవతల నుంచి సమాధానం వచ్చినట్టు లేదు.

కలక్టరుతో మాట్లాడే ప్రయత్నం ఫలించలేదు. జామర్లు ఆవహించి ఉన్నాయి. మొబైల్ సంకేతాలు అందడం లేదు. బయటి ప్రపంచంతో సంబంధాలు తెగిపోయినాయి.

నడి సంద్రంలో నావలా అడవిలో ఏడుపులా ఆందోళనకారుల నినాదాలు.

మినీ నౌక దగ్గరకొచ్చిన ప్రతిసారి కడుపులో దేవుతున్నట్టు ఏదో తెలియని గగుర్పాటు. ఇదే కాసేపు కొనసాగితే జనం బేజారవ్వడం ఖాయం.

గస్తీ పోలీసులు తమకొచ్చిన ఆదేశాలు పాటిస్తున్నారు. రింగ్ చుట్టూ తిప్పడం మానలేదు. అపుడపుడు ఆకాశంలోకి గురిపెట్టి తుపాకులు కాలుస్తున్నారు. దేశ సరిహద్దుల్లోని కాల్పుల్లా ఉంది. ఏదో నిర్ణయం తీసుకోవాలి.

నిరసన కార్యక్రమాన్ని అర్ధంతరంగా ముగించుకుని వెనుదిరగడం మంచిదేమో. నాయకుల ఆలోచనలు ఎంతకీ తెగడం లేదు. నిస్సహాయత చులకనగా మారుతుందన్న భయం. అయోమయ పరిస్థితి. మర్యాదగా గౌరవప్రదంగా విరమించుకోవడమెలాగో తెలియడం లేదు.

ఆకాశంలో హెలికాప్టరు కనిపించింది. తక్కువ ఎత్తులో చక్కర్లు కొడుతూంది. మూడుసార్లు గుండ్రంగా తిరిగి వెనుదిరిగి పోయింది. అందులో ఎవరున్నారో వెంటనే ఎందుకు వెళ్ళిపోయిందో తెలీదు.

మరో అరగంట గడిచింది.

దూరంగా ఇటువైపు వస్తున్న బోటు కనిపించింది. దాని మీద ఆకుపచ్చ జెండా రెపరెపలాడుతున్నది.

కలక్టరు దగ్గర్నుంచి అర్జంటు సమాచారం మోసుకొచ్చింది. కాకినాడలో కలక్టరు బంగ్లాలో చర్చలకు ఆహ్వానం. ఊహించని వార్త. అక్కడికేదో ప్రభుత్వం దిగొచ్చినట్లుగా భావన.

నందగోపాల్ ఆలోచనలు వేరు. కాకినాడ చర్చలకెళ్ళి సాధించేదేమీ ఉండదు. మాయమాటలతో మభ్య పెడతారు. ఇతరేతర ప్రయోజనాల ఆశ చూపించి అసలు విషయాన్ని మరుగున పెడతారు. తాత్కాలికంగా అదుపు చేయడానికి ప్రయత్నిస్తారు. క్రియ శూన్యం. ఇంత శ్రమ బూడిదలో పోసినట్లవుతుంది. ప్రస్తుతానికి వెనక్కి వెళ్ళడం ఉత్తమం.

బోట్లు వెనుదిరిగాయి. ఉత్సాహం లేదు. ఘనంగా పేల్చబోయిన బాంబు తుస్సుమన్నట్లుగా ఉంది.

వ్స్.... అని నిట్టూర్చాడు నందగోపాల్. నీరసించిపోయాడు.

గోదారి గట్టు ఇంకా చాల దూరంలో ఉండగానే జరిగిందది. ఇరవై ఏళ్ళ రాము బోటు లోంచి జారిపడ్డాడు. బుడుంగుమని మునిగిపోయాడు. రాముకు ఈత వచ్చు. అయినా నీటి పైకి రాలేకపోయాడు. బోట్లలో గజ ఈతగాళ్ళున్నారు. అమాంతం దూకారు. గాలించారు. రాము జాడ లేదు.

గోదావరి ప్రవాహం ఉధృతంగా ఉంది. సుడిగుండాలతో పరవళ్ళు తొక్కుతూంది.

వందల సంఖ్యలో నీళ్ళలో జల్లెడ పట్టారు. కాసేపటికి శవం దొరికింది.

అంతటా విషాదం అలుముకుంది. జరక్కూడనిదే జరిగింది.

రాము తండ్రి కేశవులు వేరే పడవలో ఉన్నాడు. రాము ఒక్కడే కొడుకు.

కేశవులు స్పృహ తప్పిపోయాడు. మెలకువ రాగానే తనూ గోదాట్లో దూకడానికి సిద్ధపడ్డాడు. నలుగురు పట్టుకున్నారు.

నందగోపాల్ బాధను దిగమింగుకుని మాట్లాడడానికి ప్రయత్నం చేస్తున్నాడు.

"రాము ప్రాణాన్ని వెనకి తీసుకురాలేం. దురదృష్టకరమైన సంఘటన. దారుణం జరిగిపోయింది. ఎన్నో జాగ్రత్తలు తీసుకున్నాం- ఇట్లాంటిది ఎదురు కాకూడదని.

బోలెడంత జీవితం ఉన్న రాము చనిపోవడం బాధాకరం. నాకు బాగా తెలుసున్నవాడు. చురుకైనవాడు. గస్తీ పోలీసులు దూకుడుగా ప్రవర్తించడం వల్లే ఈ అనర్థం జరిగింది. ఒక వక్క అల్లకల్లోలంగా ఉన్న సముద్రం. మరో వక్క మినీ నౌక



హడావుడి.భయభ్రాంతుల్ని చేసి మన నిరసనల గొంతుల్ని నొక్కాలని చూసారు.మొత్తం బాధ్యత చమురు కంపెనీదే. ఈ పోరాటం ఆగదు. గట్టు చేరింతర్వాత మనవేంటో నిరూపించుకుందాం"

నందగోపాల్ బోటు చుట్టూ మిగిలిన బోట్లు చేరాయి. మైకు లోంచి అతని మాటలు స్పష్టంగా వినబడుతున్నాయి.

"గత కొన్నేళ్ళుగా మత్స్యకార వృత్తిలో అనేక మార్పులొచ్చాయి. మనంతట మనం ఎవరి మీద ఆధారపడకుండా బతికేవాళ్ళమల్లా సముద్రకూలీలుగా మారడమో మరో చోటుకు వలస బాట పట్టేలా పరిస్థితులు దాపురించాయి. కొత్త వృత్తుల్ని ఎన్నుకుని అందులో మనగలగడం అంత తేలిక కాదు.

ఆధునిక యంత్ర సదుపాయం గల ప్రయివేటు బోట్లు మన నెల రోజుల జలపంటను గంటలో పోగొట్టేసుకుంటున్నాయి. ఇలాంటి చమురు కంపెనీల వల్ల చేపల వృద్ధి తగ్గింది.

నిత్యం ప్రకృతి విరుద్ధమైన ధ్వనులు...ప్రకంపనాలు చేపల మనుగడను దెబ్బతీస్తున్నాయి.అరవై ఒక్క రోజుల నిషేధంతో జీవనోపాధి కష్టమౌతున్నది. కడుపులు కాలుతున్నాయి. ఇవేమీ మీకు తెలియని కొత్త సంగతులు కావు. అనుభవిస్తున్న బాధలే" నందగోపాల్ చెప్పడం ఆపాడు. చుట్టూ పరికించి చూసాడు.. అందరూ ఏకాగ్రతతో వింటున్నారు.

నందగోపాల్ అంటే గౌరవభావం. ఏ సమస్య వచ్చినా పెద్ద దిక్కుగా ఉంటున్న వ్యక్తి. అతని మాటను వేదవాక్కుగా స్వీకరిస్తారు. అతను చెప్పింది చెయ్యడానికి ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంటారు. ఏం చేసినా మన మంచి కోసమే అని నమ్ముతారు.

"చక్కగా రిగ్‌ల దగ్గరకెళ్ళి అక్కడి అధికారులతో మాట్లాడి గంటసేపు నినాదాలు ఇచ్చి విజ్ఞాపన పత్రాలు అందజేసి ప్రశాంతంగా వచ్చేద్దామనే మన ఉద్దేశం. ఏదీ నాశనం చేయడానికి వెళ్ళలేదు. వాళ్ళే మితిమీరిన బందోబస్తీతో ఇబ్బందులు కలగజేసారు. ఖచ్చితంగా వారి అనవసర చర్యల వల్లే రాము నిండు ప్రాణాలు కోల్పోయాడు"

మౌనంగా వింటున్నారు. గాలి గట్టిగా విసురుగా వీస్తూంది. నీటి అలల మీద పడవలు ఊగుతున్నాయి. బోట్లు తూలింతకు చిత్రమైన చప్పుడు.

"చమురు కంపెనీ దుర్మార్గానికి రాము బలై పోయాడు. శవాన్ని వాళ్ళ ఆఫీసు ముందుంచి ఆందోళన చేద్దాం. ఇరవై నాలుగ్గంటల్లో సమస్య పరిష్కారం అవ్వాలన్న డిమాండుతో మొదలెడదాం" కళ్ళు తుడుచుకుంటూ కూచున్నాడు నందగోపాల్.

పక్క బోటులో ఉన్న ధర్మారావు చదువుకున్నవాడే కొంచెం ఆవేశం ఎక్కువ .అణచుకోలేకపోయాడు. బిగ్గరగా అదవడం మొదలెట్టాడు.

"ఇలా లాభం లేదండి. వాళ్ళ స్థావరాల్ని ధ్వంసం చేద్దాం.ఆయిల్ ప్లాంట్లకు నిప్పు పెడదాం. రోడ్డెక్కి ట్రాఫిక్ బంద్ చేద్దాం. బస్సులు తగలెడదాం. మెత్తగా చెబితే పనులు జరిగే కాలం కాదిది. సంచలనం కలిగించకపోతే దిగిరారు. నందగోపాల్ గారూ...ఒక్క పిలుపు ఇవ్వండి చాలు" కనుబొమలు ఎగరేస్తూ చేతులూపుతూ మాట్లాడేస్తున్నాడు ధర్మారావు.

చంద్రరావు అందుకున్నాడు- "రిగ్గుల దగ్గర రామును పోగొట్టుకున్నాం. అక్కడకు వెళ్ళకుండా ముందే వీళ్ళ ఆఫీసుల్ని తగలెడితే చచ్చినట్టు కాళ్ళ బేరానికి వచ్చేవారు "

నందగోపాల్ పరిస్థితి గ్రహించాడు. చేతులు జోడించాడు.

"ఎవ్వరూ మాట్లాడకండి. తప్పుడు ఆలోచనలు మనకొద్దు. బస్సులు, రైళ్ళు తగలెట్టడం మంచి పనికాదు.ప్రభుత్వ ఆస్తుల్ని ధ్వంసం చేయడమంటే మన ఇంటిని మనవే కూల్చడం లాంటిది. నా మీద నమ్మకముంచండి. నేను చెప్పినట్లు చేయండి. పదండి...బోట్లను వెనక్కి నడపించండి" అని సైగ చేసాడు.

"రాము అమర్ రహే...రామును పొట్టనబెట్టుకున్న చమురు కంపెనీ అతని కుటుంబాన్ని ఆదుకోవాలి. మత్స్యకారులకు రావల్సిన నష్టపరిహారం ఒకే మొత్తంగా చెల్లించాలి. వెంటనే ప్రకటించాలి. నందగోపాల్ నాయకత్వం

## కవిత

# జ్వలిస్తూనే వుంటాం.....!

ఇల్ల. ప్రసన్నలక్ష్మి



చూపుడు వేలెత్తి ప్రశ్నించనంత వరకు.....
చరిత్ర పుటలు పునరావృతమవుతూనే వుంటాయ్
బొటనవేలిని అర్పించిన అమాయక శిష్యులున్నంత వరకు
కులం కంబళి కప్పుకొని కునారిల్లే గురివింద గురువులు
జంధ్యపు పోగుల సాలె గూళ్ళలో బంధించి......
భవితవ్యాన్ని బలితీసుకుంటూనే వుంటారు
పదునెక్కిన అక్షరం ఎక్కుపెట్టిన ఆయుధమైనప్పుడు
ఎగసిపడే చైతన్య దీప్తుల్ని 'పంచమ' తంత్రంతో
పరాభవించే మనువాద అనువాదకులు
పాచికలు విసురుతూనే వుంటారు
మతం మత్తుతో మానవత్వానికి చితిపేర్చి
సమసమాజ నిర్మాణమంటూ చిలుకపలుకులు వల్లించే
కాషాయ వనంలో తెగబలిసిన గొంగళి పురుగులు
వివేకాన్ని విస్మరించి ఏ ఎండకా గొడుగుపట్టే కసాయి గురువులు
గురి చూసి మరీ వ్యక్తిత్వాలని భస్మీపటలిం చేస్తూ
మొసలి కన్నీరు కారుస్తూనే వుంటారు
దుర్నీతిని దునుమాడాలన్నా........
నవక్రాంతిని నవనాగరిక సమాజానికి అందివ్వాలన్నా..
కులరక్కసి కోరల్లో చిక్కి వ్యాకులం చెందాల్సిందేనా......?
అణగారిన వాడని
అణిచేందుకు ప్రయత్నించే ప్రతీసారీ
వేనవేల వెలుగులతో ప్రభవించే నల్లసూరీళ్ళు
నీ నడినెత్తిన జ్వలిస్తూనే వుంటారని గుర్తుంచుకో.......!

---

# లెఖ్ఖ



కొండమీద నెమళ్ళన్నీ
సామూహికంగా ఎగురుకుంటూ వచ్చి
ప్రహరీ గోడ మీదకు చేరి
పురి విప్పి ఆడుతున్నాయంటే
ఆ ఇంట్లో ఒక పసిబిడ్డ ఉన్నట్లు లెక్క...
బద్ధ శత్రువు ఎదురుపడినా
అతడు చిరునవ్వు నవ్వుతున్నాడంటే
తప్పకుండా
అతడు పూర్వ ప్రాథమిక పాఠశాలలో
పనిచేస్తునట్లు లెక్క
ఒక పెద్దకవి
ఇంకా తాజాగా తడితడిగా
ప్రవహిస్తున్నాడంటే
అతడు తన వెనక వస్తున్న వాళ్ళని
గమనిస్తున్నట్లు లెక్క
చైతన్యవంతుడెవడో
ఆగిపోయాడంటే
నడుస్తున్న దారిలో
ఎవడో అడ్డంగా వచ్చి గుద్దేసి
విరామాన్ని మిగిల్చినట్లు లెక్క
ఎన్ని ట్యాంకర్ల నీళ్ళను
తెచ్చి గుమ్మరించినా
ఆ మంట చల్లారటం లేదంటే
అది
ఎవరో దిఖ్ఖార కవి
ఎగరేసిన జ్వలన పతాకని లెఖ్ఖ

- పాయల మురళీకృష్ణ
9441026977

---

వర్థిల్లాలి" అంటూ నినాదాలు చేసారు.

బోట్లు కదిలాయి.

కంపెనీ ముందు రాము శవం. చుట్టూ వేలమంది జనం. ఆకాశం పిక్కటిల్లేలా గర్జనలు.

ఆర్డరు కాగితం చేతికిస్తే గానీ పోరాటం ఆపేది లేదని తెగేసి చెప్పాడు నందగోపాల్.

అంతే కాదు వెంటనే తేల్చకపోతే...నీరు కార్చే ప్రయత్నం చేస్తే... తాను ఆమరణ నిరాహారదీక్ష చేస్తానని...చాల మొండివాడినని ...దీక్షంటూ చేస్తే అన్నిచోట్ల జరిగినట్లు నాలుగురోజులకు బలవంతంగా ఆసుపత్రికి తరలించే విధంగా ఉండదని ప్రకటించాడు. సముద్రం లోకి వెళ్ళినవారే గాక చుట్టూ ఉన్న ఏభై ఏడు గ్రామాల మత్స్యకారులు తండోపతండాలుగా తరలి రావడం మొదలైంది. ఉద్రిక్తత చోటు చేసుకుంది. పోలీసులకు నియంత్రణ కష్టమైంది. అదనపు బలగాల కోసం పై అధికారులకు విన్నవించుకున్నారు.

కలక్టరు ప్రభుత్వం తోనూ చమురు కంపెనీల వారితోనూ చర్చలు జరిపారు. హుటాహుటీగా గాడిమొగ వచ్చేసాడు.

రాము శవంపై పూలదండ ఉంచి నందగోపాల్‌కు ఆర్డరు కాపీ అందజేసాడు కలక్టరు. అక్కడితో సమస్య తీరిందా?

ఒక ముగింపు మరో ప్రారంభానికి నాంది అవుతుందేమో. కాలమే నిర్ణయిస్తుంది.

# కుసుమ ధర్మన్న - మాకొద్దీ నల్ల దొరతనము



- డా॥ పుట్ల హేమలత
8143433030

ఒకవైపు ఆయుర్వేద వైద్యునిగా కొనసాగుతూ, సాంఘిక సమానత్వాన్ని సాధించే దిశగా కవిత్వాన్ని, వ్యాసాలను వ్రాస్తుండేవాడు. అనేక వేదికల మీద ప్రసంగించాడు. 'జయభేరి' అనే పత్రికను స్థాపించి సంపాదకత్వం వహించాడు. రాజమండ్రి కేంద్రంగా తన కార్యక్రమాలను విస్తరింపజేశాడు. రాజమండ్రి చుట్టుపక్కల ప్రాంతాల్లో ప్రతి గ్రామంలోనూ, హరిజనోద్యమ బీజాన్ని నాటినవాడు.

**19**వ శతాబ్దం తొలినాళ్ళలో స్వాతంత్ర్యోద్యమం సంఘ సంస్కరణోద్యమం ప్రబలంగా ఉన్న రోజులలో తూర్పు గోదావరి జిల్లా రాజమండ్రిలో ఒక దళిత 'కుసుమం' వికసించటం – ప్రారంభించింది. కుల వ్యవస్థ వేళ్ళూనుకున్న భారత సమాజంలో దళిత కుటుంబంలో జన్మించిన సాహితీవేత్త, హరిజనోద్ధరణ నాయకుడు కుసుమ ధర్మన్న. రాజమండ్రిలోని లక్ష్మీవారపు పేటలో 1900లో కుసుమ నాగమ్మ, వీరాస్వామి దంపతులకు జన్మించాడు. వీరు వ్యవసాయ కూలీలు. ధర్మన్న చదువుల్లో, ఆటపాటల్లో చురుకైనవాడు. ఏలూరుకు చెందిన లక్ష్మీనారాయణమ్మతో ఇతనికి వివాహం జరిగింది.

ఆది ఆంధ్రా జూనియర్ బేసిక్ ఎలిమెంట్ స్కూల్‌లో 5వ తరగతి వరకు చదివాడు. తరువాత థర్డ్ ఫారం, వైద్య విద్వాన్, సంస్కృతం, ఆంధ్రాంగ్ల, హిందీ, ఉర్దూ భాషల్లో ప్రావీణ్యం సంపాదించుకున్నాడు. ఆ మధ్యకాలంలోనే సంఘ సంస్కరణాభిలాష కలిగి కందుకూరి వీరేశలింగం ప్రభావానికి ఆకర్షితుడయ్యాడు. సాహిత్యం మీద కూడా మక్కువతో కవితలను రాయటానికి ఆసక్తిని కనబరిచారు. ఒకవైపు ఆయుర్వేద వైద్యునిగా కొనసాగుతూ, సాంఘిక సమానత్వాన్ని సాధించే దిశగా కవిత్వాన్ని, వ్యాసాలను వ్రాస్తుండేవాడు. అనేక వేదికల మీద ప్రసంగించాడు. 'జయభేరి' అనే పత్రికను స్థాపించి సంపాదకత్వం వహించాడు. రాజమండ్రి కేంద్రంగా తన కార్యక్రమాలను విస్తరింపజేశాడు. రాజమండ్రి చుట్టుపక్కల ప్రాంతాల్లో ప్రతి గ్రామంలోనూ, హరిజనోద్యమ బీజాన్ని నాటినవాడు.

కుసుమ ధర్మన్న యుక్తవయసు వచ్చేనాటికి ఆంధ్రప్రదేశ్‌లోని సామాజిక సంస్కృతి రాజకీయ, చారిత్రక నేపథ్యాలు, రకరకాల భావజాలాలతో ముడిపడి కొనసాగుతూ ఉన్నాయి. అప్పటి కాంగ్రెస్ నాయకత్వంలో జాతీయోద్యమం, గాంధీజీ నాయకత్వంలో హరిజనోద్యమం బలంగా జరుగుతున్న రోజులు. జాతీయోద్యమ నాయకులు అంతర్గతంగా బ్రాహ్మణీయ భావజాలాన్ని కొనసాగిస్తూ ఉండేవారు. బ్రిటీషు పరిపాలకులు మత ప్రచారం మీద చూపిన ఆసక్తి అంటరానితనం రూపుమాపటంపై చూపకపోవడం వల్ల దళిత జనోద్ధరణ కుంటుతూ సాగుతూ వుండేది.

ఈ సంస్కరణలో భాగంగా దళితులతో సహపంక్తి భోజనాలు జరిపేవారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న సంస్కరణవాదుల్ని బ్రాహ్మణ కులం నుండి బహిష్కరించారు.

దళితులకు ఆలయ ప్రవేశ నిషిద్ధం సరేసరి. గ్రంథాలయంలోకి కూడా దళితులకి ప్రవేశం కల్పించని రోజులవి.

అటువంటి రోజుల్లో కుసుమ ధర్మన్న గాంధీ ప్రారంభించిన హరిజనోద్యమానికి ప్రభావితుడయ్యాడు. తన పిల్లలకు కూడా గాంధీ కుటుంబానికి చెందిన పేర్లనే పెట్టుకున్నాడు. కుసుమ ధర్మన్న పిల్లల పేర్లు పావనమూర్తి, మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ, భాగ్యలక్ష్మీ, కాశీ విశాలాక్షి, చిత్తరంజన్, భగవాన్‌దాస్. పెద్దకుమారుడు పావనమూర్తి రాజమండ్రిలోని పోస్టల్ డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగం చేసేవాడు. కాశీ విశాలాక్షి బి.ఎస్.ఎన్.ఎల్ ఉద్యోగి. భాగ్యలక్ష్మి మురుగన్ అనే తమిళ వంట బ్రాహ్మణుడిని వివాహం చేసుకుంది. ఇప్పుడు కుసుమ ధర్మన్న పిల్లలందరూ చనిపోయారు. మనుమలు గుంటూరు, హైదరాబాద్‌లలో స్థిరపడ్డారు.

కుసుమ ధర్మన్న ఇల్లు 1100 గజాల స్థలంలో రాజమండ్రిలోని కోర్లమ్మ పేటలో వుండేది. విశాలమైన ఆ ప్రాంగణంలో అన్ని రకాల ఫలవృక్షాలు వుండేవి. ఇంటి వెనుక ఉన్న ఖాళీ స్థలంలో బంధుమిత్రులతో హడావిడిగా ఉండేది.

రాజమండ్రికి చెందిన **EX.M.L.A** చిట్టూరి ప్రభాకర చౌదరి చదువుకునే దశ నుంచి అంటే 1938 ప్రాంతంలో సోషలిస్ట్ భావజాలానికి దగ్గరయ్యాడు. అప్పటికీ వీరేశలింగం పాఠశాలలో ఇన్‌స్ట్రక్టర్‌గా పనిచేస్తున్న బొడ్డు బుచ్చిరాజు ఇంటి పక్కనే కుసుమ ధర్మన్న ఇల్లు కూడా. ఆ ప్రాంతమంతా తాటాకు గుడిసెలు ఉండేవి. కుసుమ ధర్మన్న ఇల్లు చాలా పెద్దగా విశాలంగా ఉండేది. రెల్లు గడ్డితో వేసిన పై కప్పు ఉండేది.

చిట్టూరి ప్రభాకర చౌదరి కుసుమ ధర్మన్న ధోరణికి, భావజాలానికి దగ్గరై వారింటికి వెళుతూ ఉండేవాడు. కుసుమ ధర్మన్న భార్య నారాయణమ్మ గారు ఏలూరుకు చెందినవారు. ఆమెకి సత్తెమ్మ అనే అక్క ఉండేది. సత్తెమ్మకి ఐదుగురు పిల్లలు. సత్తెమ్మ పెద్ద కూతురు సుశీలాబాయి. ఆమె టీచర్ ట్రైనింగ్ చేసింది. సుశీలాబాయి అప్పుడప్పుడు తన పిన్ని నారాయణమ్మ గారింటికి వస్తుండేది. కుసుమ ధర్మన్నతో పెరిగిన స్నేహం, కలిసిన అభిప్రాయాల వల్ల చిట్టూరి ప్రభాకర చౌదరి కుసుమ ధర్మన్న వదిన (భార్య అక్క) కూతురు సుశీల బాయిని ఆదర్శ వివాహం (కులాంతర వివాహం) చేసుకున్నాడు. ఆ విధంగా కుసుమ ధర్మన్న చిట్టూరి ప్రభాకర చౌదరి మామా అల్లుళ్ళు అయ్యారు.

ఈ బంధుత్వం వల్లే సుశీలబాయి గారి నాన్నమ్మ రుక్మాబాయి గాంధీజీ ఏలూరుకు వచ్చినప్పుడు ఆయనకు హారతి పట్టింది. చిట్టూరి ప్రభాకర చౌదరిగారు వారి కుమార్తె సునీత నాకు స్నేహితులవటం వలన ఈ విషయాలను వారు నాకు స్వయంగా చెప్పారు.

కుసుమ ధర్మన్న గుడివాడ సేవాశ్రమ స్థాపకుడు-గూడూరి రామచంద్రరావు పంతులు గారి దగ్గర కొంతకాలం సీతానగరం ఆశ్రమం, చాగల్లు ఆనందాశ్రమం వంటి చోట్ల కొంతకాలం వుండి తన ఉద్యమ స్ఫూర్తిని మెరుగుపరుచుకున్నాడు.

కుసుమ ధర్మన్నలో వుండే జాతీయవాద భావజాలం వల్ల కొన్నాళ్ళు జస్టిస్ పార్టీలోనూ, ఆ తర్వాత రాజమండ్రి తాలూకా బోర్డుకు కాంగ్రెస్ పార్టీ సభ్యుడుగా పనిచేశాడు. డా. బి.ఆర్ అంబేద్కర్‌కి అనుచరుడిగా ఉంటూ ఆయన భావాలను ప్రచారం చేస్తూ ఆంధ్రదేశంలో అంబేద్కర్‌ని ప్రచారం చేసిన ప్రథముడు ధర్మన్న.

1935లో రంగూన్ వెళ్ళి అక్కడి ఆది ఆంధ్రుల మధ్య నిర్వహించబడిన సభల్లో స్ఫూర్తిదాయక ప్రసంగాలను చేశాడు. ఆ సందర్భంలోనే ధర్మన్న తాను దళితుల కోసం ఒక పత్రికను నడపాలన్న ఉద్దేశాన్ని ప్రకటించాడు. అక్కడి ఆది ఆంధ్రులు తమ హర్షాన్ని వ్యక్తం చేసి ఆర్థిక సహాయం కూడా చేసి ఘనంగా సన్మానించారు. 1937లో 'జయభేరి' పత్రికను స్థాపించి ఆ పత్రిక ద్వారా అంబేద్కర్ ఆశయాలను ప్రచారం చేశారు. ఈ పత్రిక దళిత జనోద్ధరణ, దళితుల, పీడిత శ్రామిక వర్గాల కష్టాలను జన బాహుళ్యంలోకి తీసుకురావటానికి కృషిచేసింది. ఈ పత్రిక దళితేతర పాఠకులకి కూడా ప్రీతిపాత్రమైంది. పద్మభూషణ్ బోయి భీమన్న, దిడ్ల పుల్లయ్యగారు ఈ పత్రికకి ఉపసంపాదకులుగా పనిచేశారు.

ఆ కాలంలో కుల సంఘాలు కార్తీక మాసాల్లో జరుపుకునే వన భోజనాల సంస్కృతిని కుసుమ ధర్మన్న కాస్త కొత్త ఆలోచనలతో దళితుల పరిచయ కార్యక్రమాలకి వేదికగా మార్చుకున్నారు. ఈ కార్యక్రమానికి ఒక కమిటీని ఏర్పాటుచేసుకుని, ప్రతి ఇంటి నుంచి వంట సరుకులు

**డా. బి.ఆర్ అంబేద్కర్‌కి అనుచరుడిగా ఉంటూ ఆయన భావాలను ప్రచారం చేస్తూ ఆంధ్రదేశంలో అంబేద్కర్‌ని ప్రచారం చేసిన ప్రథముడు ధర్మన్న.**

సేకరించి వన భోజనాలను నిర్వహించి దళిత కుటుంబాల పరిచయ వేదికగా మలిచాడు. దళితుల సమైక్యత, దళిత సమస్యల కార్యాచరణ పథకాల చర్చ జరుపుకోవటానికి ఈ కార్యక్రమం ఎంతగానో ఉపయోగపడింది.

**దళితుల కోసం వారి ఆర్థిక పరిస్థితుల ప్రయోజనం కోసం 1945లో హరిజన బ్యాంకును స్థాపించారు.**

రాజా రామ్మోహనరాయ్, కందుకూరి వీరేశలింగం ప్రభావంతో బ్రహ్మ సమాజంలో కూడా పనిచేశాడు.

దళితుల కోసం వారి ఆర్థిక పరిస్థితుల ప్రయోజనం కోసం 1945లో హరిజన బ్యాంకును స్థాపించారు. కుసుమ వీరాస్వామి, కుసుమ వెంకటరామయ్య, కురుపోతు సోమన్న, దిడ్ల పుల్లయ్య, జాలా రంగస్వామి మొదలగు వారంతా ఈ బ్యాంకులో సభ్యులు. హరిజనులు కూలీ పనులు దొరకని కాలాల్లో ఈ బ్యాంకు నుండి రుణాలను తీసుకుని తిరిగి చెల్లించుకునే విధంగా అప్పటి కలెక్టర్ ఈ బ్యాంకుకు కొంత మూలధనాన్ని ఏర్పాటు చేశాడు.

ఒక సందర్భంలో గాంధీ రాజమండ్రిలోని హరిజన నాయకులతో సమావేశమైనప్పుడు కుసుమ ధర్మన్న ఆ సమావేశానికి వెళ్ళలేదు. హరిజన నాయకుడిగా పర్యటనకి వచ్చినప్పుడు తమపేటలకే వచ్చి మాట్లాడాలని గాంధీకి కబురు పెట్టాడు. గాంధీతోపాటు మరికొంతమంది కాంగ్రెస్ నాయకులను కూడా తమపేటకు రప్పించి ఆతిథ్యమిచ్చాడు. దళితులకోసం ఎన్నోకార్యక్రమాలు నిర్వహిస్తూ చైతన్యపరుస్తూ కులవ్యవస్థని ప్రశ్నించిన ధైర్యశాలి కుసుమ ధర్మన్న. కుసుమ ధర్మన్న 'హరిజన శతకం' 'నిమ్నజాతి' విముక్తి తరంగిణి మొ॥ పుస్తకాలు రచించాడు.

1936లో విజయ నగరంలో ఆది ఆంధ్రమహాసభకి అధ్యక్షత వహించిన కుసుమ ధర్మన్న సామ్యవాదాన్ని సహించని హిందూమతాన్ని ప్రశ్నిస్తూ ప్రసంగించారు.

దళిత చైతన్యం కోసం సాహిత్యాన్ని కూడా ఒక మార్గంగా ఉపయోగించుకున్నాడు. పాట ఆశువుగా అతి సులువుగా ప్రజల్లోకి చొచ్చుకుపోతుంది. ఆలోచింపజేసేలా చేస్తుంది. ధర్మన్న ఈ మార్గంలో దళిత ప్రజల కష్టాలని అణిచివేతని పాటరూపంలో ప్రవేశపెట్టాడు. ప్రజల నాలుకల మీద చైతన్యమై నిలిచాడు.

సామాన్యమైన వ్యక్తిగా జీవిస్తూ ఒక కార్యకర్తగానే ఉద్యమంలో పాల్గొని పనిచేశాడు. ఉద్యమంలో తాను నమ్మిన సిద్ధాంతాన్ని అట్టడుగు వర్గ ప్రజల కన్నీళ్ళని సహృదయభావనలతో ముందుకు నడిపించిన గొప్పనాయకుడు కుసుమ ధర్మన్న. పైనాయకుల అండతో వారి కనుసన్నలలో ముందుకు సాగుతూ అడుగులకు మడుగులొత్తే స్వార్థ రాజకీయ వాతావరణానికి దూరంగా నిజాయితీగా దళిత ఉద్యమాన్ని ప్రేమించిన వ్యక్తి ధర్మన్న.

కులమనే కాలకూట విషం నరనరాన జీర్ణించుకున్న హైందవ వర్ణ వ్యవస్థకి భిన్నంగా రచనలు చేస్తూ ధైర్యంతో తన స్వరాన్ని వినిపించినవాడు అంత ఆత్మవిశ్వాసం కలవాడు, తెగువవున్నవాడు కావడం వల్లే గరిమెళ్ళ సత్యనారాయణ రాసిన పాటకి ధీటుగా మాకొద్దీతెల్లదొరతనము అనే గీతాన్ని రాయగలిగినవాడు. ఈగీతంలో దళితుల నికృష్టమైన జీవితాలని నేర్పుతో ప్రజలందరికీ అర్థమయ్యే భాషలో కవిత్వీకరించగలిగాడు.

అప్పటికి గరిమెళ్ళ గీతం ఒక ప్రభంజనంలా మారుమ్రోగుతున్న కాలం. ఆ గీతానికి వ్యతిరేకంగా రాయటం వల్ల మిగతా ప్రజలకు కూడా ఈ గీతం పట్ల ఆసక్తి ఏర్పడింది. ప్రజల్లో పోటీభావం కూడ ఏర్పడింది. ఒకే సమయంలో ఎన్నో వేదికలపై కొనసాగిన స్వాతంత్రోద్యమ, హరిజనోద్యమ కార్యక్రమంలో ఈరెండు గీతాలు పోటాపోటీగా పాడబడుతూ ఉండేవి. కుసుమ ధర్మన్న రాసిన పాటని కించపరచటానికి సరియైన స్పందనరాలేదని ప్రచారం చేయడానికి కులవాదులు కాచుకొని కూర్చునేవారు.

1921లో గరిమెళ్ళ సత్యనారాయణ 'మాకొద్దీ తెల్లదొరతనము' గీతాన్ని వ్రాశారు. అదే సం॥ కుసుమ ధర్మన్న కూడా 'మా కొద్దీ దొరతనము' రాశాడు.... స్వాతంత్ర్యం వస్తే తెల్లదొరల స్థానంలో నల్లదొరలు అధికారంలోకి వస్తారు. అంటరానితనం కొనసాగుతూనే వుంటుంది. సమాజంలో ఎప్పుడైతే అస్పృశ్యభావన సమసిపోతుందో అప్పుడే దళితులు స్వతంత్ర్యులవుతారని భావించారు. ఈ ఆలోచన నుంచే 'మాకొద్దీ నల్లదొరతనము దేవా! మాకొద్దీ నల్లదొరతనము......

మాకు పదిమందితో పాటు పరువు గలుగకయున్న

"మాకొద్దీనల్ల"

అనే పల్లవీ, అనుపల్లవులతో ఈ గేయాన్ని రాశాడు.

1933లో ఈ పాటని నాల్గవ ముద్రణ చేసినప్పుడు ధర్మన్న కవి పల్లవిని మార్పుచేశాడు. మాకొద్దీ నల్లదొరతనము అనే పల్లవికి బదులుగా 'అంటుదోషము బాపుమయ్య దేవా! అంటుదోషము బాపుమయ్య కడుపుగొట్టి, నెట్టి కడగండ్ల గుడిపేట-అంటుదోషం బాపుమయ్య'అని మార్పు చేశాడు.

నల్లదొరతనంలో 32గేయ ఖండికలున్నాయి. ఈ పుస్తక ప్రారంభంలో 'భారతమాత' అనే శీర్షికతో భారతదేశాన్ని ప్రస్తుతించటం కన్పిస్తుంది. కవులను, శూరులను, ఆధ్యాత్మిక క్షేత్రాలను సంపదకి నిలయమైన భరతమాత శుభాన్ని కలిగించాలని కోరుకుంటాడు. ఈ సందర్భం ధర్మన్న కవిలోని దేశభక్తిని గోచరపరుస్తుంది.

హరిజన కులాన్ని కుయుక్తితో వర్ణవ్యవస్థ స్థాపకులే సృష్టించారనే విషయాన్ని చూపుతూ మనుస్మృతి, భగవద్గీతల శ్లోకాలని ప్రస్తావించాడు. నల్లదొరతనం గేయంలో

**పన్నెండుమాసాలు పాలేరుతనమున్న**
**పస్తులు పడుతూ బతకాలండీ**
**ఆలికూలీ జేసితీరాలండీ**
**పిల్లగాడు పశువులగాయాలండీ**
**పగలురేయీ పాటుపడ్డానండీ**
**కట్టగుడ్డకూడు గిట్టదండీ**
**రోగమొస్తేనాగ దప్పు దండి**
**అప్పుతీరదీచిత్రమేనండి**
**ఈ నిప్పుపైనిక మేము నిలువలేమో తండ్రీ!**
**మాకొద్దీనల్లదొరతనము**

అంటూ దళితుల దీనావస్థను పాటగా మలిచాడు

**పాడిపంటలు మేము కూడబెడితేవారు**
**కూర్చోనితింటామంటారు**
**నాములిచ్చినట్టేటముంచేరు**
**ఎంచి అప్పు-అప్పుపెంచుతారు**
**చెంపకొట్టి కొంపలాగుతారు**

తమ దొరల దగ్గర ఇంటిల్లిపాదీ అనగా భార్యాబిడ్డలతో కాయకష్టం చేసి పొలంలో చెమట చుక్కలు కార్చి పంట పండించి ధాన్యరాశుల్ని కూడబెడితే వారు కూర్చోని తింటూ విషతుల్యమైన నాములను

(ఈ నాములు: జొన్న కోసిన తర్వాత తిరిగి చిగురించే మొలకలు. ఇవి విషతుల్యం)

అప్పులను పెంచుతూ చెంప పగులగొట్టైనా ఉన్న చిన్నకొంపని కూడా లాక్కుంటారు. అని ఆనాటికీ, ఈనాటికీ దళితకూలీలకు జరుగుతున్న అన్యాయాన్ని అప్పుడే ధైర్యంగా ప్రశ్నించిన ధర్మజ్ఞాని కుసుమ ధర్మన్న.

ఇంకా ఈ గేయంలో నిరుపేద దళితుల అణిచివేత భరించలేని బాధలను నిప్పులతో పోలుస్తూ ఆ నిప్పులపైన దళితజాతి నిలబడలేదని ఆక్రోశిస్తాడు - కనికరం లేకుండా కడుపు మాడ్చే యజమాని జులుంని ప్రశ్నిస్తాడు. పదిమందితో పాటు తమ జాతికి కూడా పరువుగా బ్రతికే హక్కుఉండాలని ఆశిస్తాడు. కోర్టులకెక్కినన్తా మాలమాదిగలంటూ మండిపడుతుంటారు. ఊరిచివరలో పూరిగుడిసెలో సరియైన గోడలు కూడా లేని తడికెల మధ్య నివసించే బడుగు వర్గాలకి తినడానికి తిండి, కట్టుకోవడానికి బట్టని ఊహించలేము. ఇంకా నగలూ, దున్నుకోవడానికి పొలమూ వస్తాయని ఎలా ఆశపడగలరు? దేశంలోని ప్రజలందరికీ ఈ వర్గాల ప్రజలను భరించటం చేదుగా ఉంటుంది. కనీసం దయకూడా పుట్టదు. ఇటువంటి స్థితిలో వున్న దళితుల బాధని తన బాధగా చేసుకుని ఈ గేయాన్ని ముందుకు నడిపించాడు ధర్మన్నకవి.

ఆకలిని, లేమిని అవహేళన చేస్తూ పైకి మాత్రం ఎదుటివారి పేదరికాన్ని, ఒకవరంలా, భావించుకోమని ఉచితసలహాలిస్తుంటారు. ఒంటినిండా గుడ్డకట్టుకోవడం కంటే గోచిగుడ్డేమేలని, చుట్టు గుడిసేలాంటి కొంపల్లోనే లక్ష్మీదేవి తిరుగాడుతుందని, గంజి బలమైన ఆహారమని దళితులకు నూరిపోస్తూ ఖాళీ చెంచాలతో కడుపునింపే కామాందుల కుళ్లని కడిగేస్తాడు. ఈ రోజుల్లో కూడా కొన్ని ప్రాంతాలలో హోటళ్ళలో అంటరానితనం, రెండుగ్లాసుల పద్ధతి కొనసాగుతూనే ఉంది. ధర్మన్న కాలంనాటికి ఈ వివక్ష ఇంకెంత భయంకరంగా ఉంటుందో ఊహించుకోవచ్చు. ఆకలితో చచ్చిపోయే స్థితిలో ఉన్నా కూడా అన్నసత్రాలు ఉండేవి కావని నోరెండి పోయినా, తాగటానికి నీరు దొరకదని మొక్కటానికి కనీసం దేవుడు కూడా లేదని తాము మనుషులమనే మాటే మరచిపోయారని ఈ గేయంలో ఏకరువు పెడతాడు.

దళితులతో పని అవసరం ఉన్నప్పుడు మాత్రం అంటు చూపించరు. ఇళ్ళలో పనులు చేసేటప్పుడు, పాత్రలు కడిగేటప్పుడు, బట్టలు ఉతికినప్పుడు, పంటనూర్చి వారి

## జీవన విద్యాభ్యాసం

- ఎరుకలపూడి గోపీనాథరావు
9848293119



బ్రతుకునొక మధురకావ్యంగా
రూపొందించే శాస్త్రమభ్యసించాలి
బండరాయి వంటి బ్రతుకు దక్కినా
మనోహర శిల్పంలా మలచే
జీవన విజ్ఞానశాస్త్రమభ్యసించాలి
ఇతరేతర అవసరాలు తీర్చేందుకు
అనేక విద్యార్హతలుండొచ్చు కానీ
బ్రతుకును జీవింపజేసే విద్యార్జనకన్నా
విలువైన విద్యార్జనేముంటుంది?
కలలను ఫలింపజేస్తూ
బ్రతుకు పరమార్థాన్ని బోధించే
జీవన శాస్త్రాధ్యయనం కన్నా
గొప్ప అధ్యయనమేముంటుంది
'బ్రతకడమంటే - జనన మరణాల మధ్యనుండే
ఖాళీని పూరించడమే కాదు సుమా..
బంధాలలో బంధమై, అందాలలో అందమై
బలపడుతూ, వెలువడుతూ వికసించడమే'నని నేర్పే
జీవనశాస్త్రం సిలబస్ కన్నామించిన పాఠ్యాంశాలేముంటాయి?
'బ్రతుకు'- జీవించే కళలతో కాంతిల్లితే ఎంత బావుంటుంది?
విశ్వమంతా - సమున్నత జీవన కళారాధకుల ఆలయమైతే
ఎంత బావుంటుంది?
అపుడపుడూ-
పదునైన కంటకాల వంటి కష్టాల పథాలెదురు కావచ్చు..
ఉండి ఉండీ -
అకస్మాత్తుగా ఉప్పొంగే
పరితాపాల అశ్రుపాతాలను
దిగమ్రింగుకోవలసిన దీనావస్థలేర్పడవచ్చు..
మధ్యమధ్యలో -
కొన్ని త్యాగాలు చేయవలసిన
అవసరాలవపిల్లవచ్చు..
కొన్ని కొన్ని సార్లు -
స్వల్ప పరిమితుల మధ్య
సర్దుకుపోవలసిన అగత్యాలు దాపరించవచ్చు..
ఏదేమైనా.. వెఱుపుతో వెనుకంజవేయకుండా
విచారిస్తూ, విరక్తి చెందుతూ
ప్రయత్నాలు విరమించకుండా
శ్వాస ఉన్నంతవఱకూ-
జీవన విద్యాభ్యాసం సాగించడం
ఎంత శుభప్రదంగా వుంటుంది!
వంద శాపాల మధ్యన కూడా
బ్రతుకునొక వరంలా భావిస్తూ
సహనాన్ని సన్నగిల్లజేసే అడ్డంకులను,
అపశ్రుతులను చెదరగొడుతూ
జీవన వీణాతంత్రులను సుమధురంగా
పలికించడమెంత ప్రశంసనీయంగా వుంటుంది!

---

గాదెలు నింపేటప్పుడు కాళ్లూ, చేతులు తగిలినా లేని అంటు ఏమీపనిలేనప్పుడు మాత్రం దూరంగా ఉంచటాన్ని ధర్మన్న ప్రశ్నిస్తాడు.

స్వరాజ్యం కోసం ప్రభుత్వంతో పోరాడే నల్లదొరలు తమ ఇళ్ళల్లో, పొలాల్లో పనిచేసే దళితులకు మాత్రం స్వతంత్ర్యాన్ని ఇయ్యరు. గుళ్ళూ, గోపురాలకూ, బావుల్లో నీళ్ళుతోడుకోవడానికి ఒప్పుకోరు. మాలలంటితే మైలతగులుతుందని దూరంపెట్టే నల్లదొరలకు స్వరాజ్యాన్నడిగే హక్కు ఎక్కడుందని ఈ గేయంలో ఆవేశపడతాడు.

కుసుమ ధర్మన్న ఈ గేయంతో పాటుగా మరికొన్ని ప్రక్రియల్లో కూడా 'సాహిత్యం రాశాడు. ప్రముఖ రచయిత సి.వి. అతి కష్టం మీద హరిజన శతకం, మాకొద్దీ నల్లదొరతనం గీతాలను సేకరించారు. అలభ్యమైన ఇతర రచనలను కూడా పరిశోధకులు సేకరించగలిగితే కుసుమ ధర్మన్న ఉద్యమ పోరాట స్ఫూర్తి నేటితరానికి అందుతుంది.

1946లో ఆయన మరణించటానికి కొన్ని గంటల ముందే హరిజనుల సోదరులతో కలిసి రాజమండ్రి కోటిలింగాలపేటలోని హిందూ దేవాలయ ప్రవేశం చేసిన ధైర్యశాలి కుసుమ ధర్మన్న 46 ఏళ్ళకే నూరేళ్ళు పూర్తిచేసుకుని దళితులకి మార్గదర్శిగా మిగిలాడు. ఆయన మరణించినా సజీవంగా మిగిలాల్సిన అక్షరాలను కూడా ఆయన ఇంటితో పాటు కాల్చి బూడిద చేశారు. గుర్తు తెలియని దళిత విద్వేషకులు. కానీ ఉద్యమ పోరాటానికి అక్షర శక్తికి మరణం ఉండదు.

# చీమలు

- కె.ఆంజనేయ కుమార్
9494053019



పాలుకి చీమలు పడతాయేమోనని
గిన్నెని ఒక సెమెంట్ కుదురుపై వుంచి
దానికి చుట్టూ ఉండే అంచులో నీరుపోసి
జాగ్రత్తగా దాచివుంచేది అమ్మ!
పాలుకి ఎప్పుడైనా ఎర్ర చీమలు పడితే
వాటిని చీమలతో సహా గటగటా తాగేస్తే..
కంటిచూపుకి చాలా మంచిది అనేది.. అమ్మ!!
ఏ గోడ మూలనో వరుసగా స్కూలు పిల్లల్లా
నడిచిపోయే ఎర్ర చీమల బారుని..
చూపుడు వేలుకి తడి చేసుకొని
వాటిని అలవోకగా అంటించుకొని..
ఒక చుట్టాలాయన
చిన్నప్పుడు నన్ను ఆటపట్టించడానికి..
తడి చీమల్ని నా శరీరానికి రాయగానే
అవి కుట్టి నా చర్మం బొబ్బలెక్కినపుడు
అమ్మ తల్లడిల్లిపోయింది!
ఆ చుట్టాలతన్ని.. చావుతిట్లు తిట్టింది!!
ఇప్పుడు..
అత్యాధునికమైన వంట గదులూ..
వాటిలో ఆధునికమైన శీతల పెట్టెలూ..
చల్ల బీరువాలూ..
గాలి కూడా చొరబడని కంటైనర్లూ వచ్చాక..
పాలు, పంచదార, బెల్లం లాంటి
తీపివస్తువులకి కూడా
చీమలు పట్టే రోజులు ఎప్పుడో పోయాయి!
అందుకే కాబోలు..
నిత్యావసర వస్తువుల ధరలు అడవిమంటల్లా
సామాన్య ప్రజల్ని ఎంతగా దహిస్తున్నా కూడా
ప్రభుత్వాలకి చీమకుట్టినట్లైనా ఉండటం లేదు!
ఇదివరకు.. చంటిపిల్లలు..
వాటి బంగారు పుట్టలో వేలు పెడితేనే
చీమలు కుట్టాయని
నాయనమ్మ చెప్పిన కథల్లో.. విన్న గుర్తు!
ఇప్పుడేమిటి.. అవే చీమలు..
ప్రభుత్వ ఆసుపత్రుల్లో పుట్టిన పసిపిల్లల
ఉయ్యాలలోకి..
బాలింతల పడకలపైకి ఎక్కి మరీ.. కుట్టి కుట్టి..
చంటి పిల్లల్ని ఎందుకు చంపుతున్నాయి?
"మీరు కూడా ఏదో ఒక కార్డు పట్టుకొని
కార్పొరేట్ ఆసుపత్రుల్లో ఎంచక్కా చేరివుంటే..
అటు వైద్య దొర బాబులకీ
ఇటు ప్రభుత్వ అధికార బాబులకీ
పర్సంటేజీల ఆదాయం వచ్చేది కదా!
ప్రభుత్వ ఆసుపత్రుల్లో చేరి
వారి రాబడికి గండి కొడతారా?"
అని చెబుతున్నట్టు కాబోలు..
గండు చీమలు దండెత్తి మరీ కుట్టాయి!
పసిపాప ప్రాణం నిలువునా తీసాయి!
అధికారంలో వున్న రాజకీయనాయకులు
ఎక్కడైనా.. ఏదైనా ప్రారంభోత్సవానికి వస్తుంటే..
వాళ్ళు వచ్చే దారంట.. రోడ్డు కిరువైపులా
అందంగా ఆహ్వాన ముగ్గులా పోసే..
చీమల మందు..
చెప్పకనే చెపుతోంది..!
ఇప్పుడు చీమలు ఏ రూపంలో మారాయో?
ప్రజల ప్రాణాల్ని నొప్పిలేకుండా ఎంతలా
తింటున్నాయో!
చిన్నప్పుడు
ఊరు చివర రాతిగుట్టల్ని విత్తనాలుగా నాటుకున్న
ఒక పర్వతారోహకుడు
పెద్దయ్యాక
ఖండాతరాల మేరునగ పర్వతాల్ని జయించినట్టు..
ఇప్పుడందరూ
చీమల్ని విత్తనాలుగా నాటుకోవాలి!
బలవంతమైన అధికార సర్పాల్ని కుట్టి చంపే
చలి చీమలుగా మారాలి!
ఇప్పుడందరూ
చీమలెంతకుట్టినా చనిపోకుండా ఉండేలా
వారి పిల్లల్ని.. సహజ కవచకుండలాలో కర్ణుల్లా
కనాలి!
అయినా.. చీమల్లారా .. మీకో ఆఖరి విన్నపం..
ఇప్పుడు.. మీరు కుట్టి చంపాల్సింది పసిపిల్లల్ని
కాదు!
భజన మీడియా రక్షణలో కన్నూ మిన్నూ కానక
ప్రజల పంటభూముల మట్టి రేణువులపై
విదేశీ ఉక్కుపాదాలతో చీమల్లా అణచివేస్తున్న
అధికార విషం కక్కుతున్న కాలసర్పాలని!

❋

# మెతుకుల దిబ్బ



- బిరుసు సురేష్‌బాబు
7569480800

"ఇదొక్క ముద్ద తిను బంగారం. నా కన్న కదూ...నా బుజ్జి కదూ..." అమ్మ అన్నం గిన్నె చేతిలో పెట్టుకొని తన రెండేండ్ల కొడుకును వేడుకొంటోంది. ఓ పక్క తినాలని ఉన్నా, అమ్మ బుజ్జిగింపు కోసమే వేచి ఉన్న కొడుకు. అమ్మకు దొరకకుండా బుడి బుడి అడుగులతో అటూ, ఇటూ పరిగెడుతున్నాడు. ఎలాగైతేనేం చివరకు అమ్మకు దొరికిపోక తప్పలేదు బిడ్డ.

"నాన్న ముద్ద తిన్నావూ...అక్క ముద్ద తిన్నావూ...అవ్వ ముద్ద తిన్నావూ...మరి నా ముద్ద తినవా?" అని దీనంగా ముఖం పెట్టిన అమ్మను చూసి పసి గుండె కరిగిపోయింది. "ఆఁ..." అంటూ నోరు తెరిచి చివరి ముద్ద నోట్లో పెట్టించుకున్నాడు. గిన్నెలో అరముద్ద మిగిలింది. అదెటూ ఇంక తినడని అమ్మకు తెలుసు. ఆ చుట్టు ప్రక్కల ఎవరూ లేరు. తన దిష్టి బిడ్డకు తగులుతుందేమోనని, మిగిలిన అన్నాన్ని చేతిలోకి తీసుకొని బిడ్డ తల చుట్టూ మూడు సార్లు తిప్పి, తుపు...తుపు...తుపు...అని ఊసి బయట పారేసింది. ప్రపంచంలోని సంపదనంతా ఒక పక్క వేసి, అమ్మ ప్రేమను ఒక వైపు వేసి తూస్తే నిస్సంకోచంగా అమ్మ ప్రేమే గెలుస్తుందన్నట్లు.

ఆ ఇంటి ముందు రోడ్డుకు ఆ వైపు వేప చెట్టు కింద అరవై అయిదేండ్ల ముసలామె కూర్చొని ఉంది. ముడుతలు పడ్డ ముఖం, జీవం లేని కళ్ళు, మాసిపోయిన చీర, మురికిపట్టిన తెల్లని వెంట్రుకలు ఆమె ఆస్తులు. ఆ ఇంట్లోని తల్లీబిడ్డల ఆనందాన్ని దూరం నుండి కన్నార్పకుండా చూస్తూ, మురిసిపోతూ ఆకలిని మరిచిపోయేందుకు ప్రయత్నం చేస్తుంది. ఆకలిని ఎంతసేపు ఆపగలం. కాసేపటికీ కడుపులోని పేగులు అరుస్తూ రాజవ్వకు తమ గోడును చెప్పుకుంటున్నాయి.

రాజవ్వ భర్త రామయ్య అన్నం తీసుకురావడానికి పొద్దుననంగా వెళ్ళాడు. మధ్యాహ్నం రెండు గంటలు కావస్తుంది. ఇంకా రాలేదు. వస్తే అన్నం తెస్తాడు. రాజవ్వ ఎదురుచూస్తోంది. వాళ్ళిద్దరూ కూడు తిని మూడు రోజులు

దాటింది.

ఎంత కడుపు కాలుతున్నా, చెయ్యి చాపి ఓ రూపాయి అడగడం, ఓ ముద్ద పెట్టమని అడగడం వాళ్ళకు చేతకాని పని. అలా అడగడమంటే వాళ్ళు యుద్ధంలా భావిస్తారు. ఆకలితో యుద్ధం చేయడం వాళ్ళకు వెన్నతో పెట్టిన విద్య. ఈ యుద్ధాన్ని వాళ్ళు దాదాపు ఐదు సంవత్సరాల నుండి చేస్తూనే ఉన్నారు. అయితే ఆ యుద్ధంలో ఎవరు గెలుస్తారో ఫలితం తెలిసిపోయే సమయం కూడా అసన్నమైనట్లుంది.



రాఘవేంద్ర కల్యాణమండపం ఆ ఊర్లో పేరు పొందిన పెద్ద కల్యాణమండపం. అక్కడ పెండ్లో, ఏదో ఒక శుభకార్యమో వారానికి ఒకటి రెండు సార్లైనా ఖచ్చితంగా జరుగుతాయి. ఆ రోజు మండపంలో పెళ్ళి పూర్తయింది. పెళ్ళి భోజనాలు మొదలయ్యాయి. పావు గంటకో బంతి భోజనాలు చేసి వెళ్తున్నారు. తిన్న తర్వాత పేపరు ప్లేట్లను, దాంట్లో మిగిలిపోయిన స్వీటు ముక్కలు, మిగిలిన అన్నం మొత్తం ఎత్తి బయట ఉన్న దిబ్బలో పడేసి వెళ్తున్నారు పనివాళ్ళు. కార్యక్రమం అయిన వెంటనే దిబ్బలో పడేసిన దాన్ని మొత్తం వేసుకొని ఊరికి దూరంగా పడేయడానికి అక్కడే ట్రాక్టర్ కూడా సిద్ధంగా ఉంది.

ఎప్పటిలాగే రామయ్య అక్కడికొచ్చి నిలబడ్డాడు. కష్టపడిన శరీరం కాబట్టి తన భార్య కన్నా కొంచెం దృఢంగానే ఉన్నాడు. అతను చింపిరి జుట్టుతో, చిరిగిన చొక్కాతో మసిగుడ్డ కన్న హీనంగా ఉన్న పంచ కట్టుకుని ఉన్నాడు. చుట్టూ ఎవరూ లేరు. ట్రాక్టరును చూసి గద్దను చూసిన కోడిపిల్లల తల్లిలా మెతుకుల దిబ్బ దగ్గరకు గబగబా వెళ్ళాడు. పేపర్ ప్లేట్లను ఒక్కొక్కటే తీస్తూ ఉన్నాడు. నిరాశ, ఎవరూ ఏమీ మిగల్చలేదు. ఎవరైనా ధర్మాత్ముడు ఏ కొంచెమో మిగిల్చి ఉండక పోతాడా అని రామయ్య తన వెతుకులాటను మరింత ముమ్మరం చేశాడు.

ఇరవై, ముప్పై ప్లేట్లను తొలగించాక సగం తిన్న జాంగ్రీ కనిపించింది. పురావస్తు తవ్వకాల్లో అపురూపమైన వస్తువు బయటపడినప్పుడు, పురావస్తు శాస్త్రవేత్త పడే ఆనందానికి వంద రెట్ల ఆనందం రామయ్యలో కనిపించింది. జాంగ్రీని తనతో పాటూ తెచ్చుకున్న ప్లాస్టిక్ కవర్‌లో భద్రంగా దాచి పెట్టాడు. తన పరిశోధన మరింత వేగవంతం చేశాడు. ఇప్పుడు తనకు అద్భుతమైన ఫలితం దక్కింది. అదేమిటంటే ఎవరో అన్నాన్ని కూరతో బాగా కలిపి కొంచెం తిని మిగిలిందంతా అలాగే వదిలేశారు. అది చూసిన రామయ్య సంతోషానికి అవధుల్లేకుండాపోయాయి. ఆ కలిపిన అన్నాన్ని కూడా కవర్లో వేసుకున్నాడు. ఆ తర్వాత జరిపిన తవ్వకాల్లో అక్కడ కొంచెం...అక్కడ కొంచెం అన్నం దొరికింది. మొత్త మీద తాను తెచ్చుకున్న కవర్‌లోకి సగంపైగా తిండిని నింపుకున్నాడు.

అక్కడ నుండి తన భార్య ఉన్న చోటుకు బయల్దేరాడు రామయ్య. తిని, భార్యకు తీసుకెళ్ళడమనేది అతనికి ఇష్టం లేని పని. ఇద్దరూ కలిసి తింటేనే తనకు తృప్తిగా ఉంటుంది. తన భార్య తన కోసం ఎదురుచూస్తూ ఉంటుంది. ఇప్పటికే చాలా ఆలస్యమైందని కవర్‌ను కుడి చేత్తో పట్టుకొని కొంచెం వేగంగా అడుగులేస్తున్నాడు. మొత్తానికి తను తాత్కాలిక నివాస స్థావరమైన వేపచెట్టు దగ్గరకు చేరుకున్నాడు.

అప్పటికే రాజవ్వ సోలిపోయి చెట్టు మొదలుకు తల ఆనించి కళ్ళు మూసి ఉంది. రామయ్య ఆమెను తట్టి లేపాడు. రాజవ్వ మెల్లగా కళ్ళు తెరిచింది. చెట్టుకు ఆన్చిన తలను పక్కకు తీయడానికి కూడా ఆమెకు శక్తిలేకుండా పోయింది. ఇద్దరూ కలిసి తెచ్చిన అన్నాన్ని తృప్తిగా తిన్నారు. మిగిలిన దాన్ని రాత్రికి కూడా ఉంచుకున్నారు. ఆ రోజు అలా గడిచిపోయింది. ఆ రోజే కాదు ఆ నెల కూడా అలాగే ఎలాగోలాగా గడిచిపోయింది.

⁂ ⁂ ⁂

రాఘవేంద్ర కల్యాణమండపాన్ని ఏవో కారణాల వల్ల మూసివేశారు. ఆషాఢమాసం కావడంతో ఎక్కడా ఏ శుభకార్యం జరగలేదు. మూడు రోజుల ఆకలికి అలవాటుపడ్డ ప్రాణాలు వారం రోజుల ఆకలికి తట్టుకోవడం ఇబ్బందిగా మారింది. రాజవ్వ పరిస్థితి మరీ దీనంగా తయారయ్యింది.

ఆ ఉర్లో కొండపైనున్న గుడి పుణ్యక్షేత్రంగా ప్రసిద్ధిగాంచింది. వేలమంది భక్తులు కాలినడకన కొండపైకి

వెళ్తుంటారు. కింద మెట్ల దగ్గర సుమారు యాభైమంది భిక్షమెత్తే వాళ్ళున్నారు. దీన్ని బట్టి ఆ గుడి ఎంత ప్రఖ్యాతమైనదో తెలిసిపోతుంది. మెట్ల దగ్గర ఆ వైపు సగం, ఈ వైపు సగం మంది కూర్చొని యుద్ధానికి సన్నద్ధమైన సైనికుల్లా ఉన్నారు. వాళ్ళ శత్రువులు భక్తులు కాదు ఆకలి.



చెయ్యి లేనోళ్ళు, కాళ్ళు లేనోళ్ళు, కళ్ళు లేనోళ్ళు అన్నీ ఉన్నా ఏదో లేనోళ్ళు రకరకాల వాళ్ళంతా అక్కడ ఉన్నారు. తన భార్య ధీనస్థితిని చూడలేని రామయ్య, ఇష్టం లేకపోయినా ఆ సైనికుల పక్కన తానో సైనికుడిలా కూర్చున్నాడు.

అందరూ తమ ముందు గిన్నెలో, టవళ్లో, తుండు గుడ్డలో పరచుకొని ఉన్నారు. రామయ్య అలాంటివేమి తెచ్చుకోలేదు. తన చిరిగిన పంచనే కొంచెం చించి ముందుపరిచాడు.

మెట్లెక్కే వాళ్ళను ధర్మం చేయమంటూ అందరూ ఒక్కసారిగా మొరపెట్టడం మొదలపెట్టారు. రామయ్య నోరు మాత్రం తెరవడానికీ, అరవడానికీ నిరాకరించింది. కళ్ళు తెరిచి వెళ్ళే వాళ్ళను చూడడం కూడా ఇష్టంలేక గట్టిగా కళ్ళు మూసుకొని వెనక గోడకు ఆనుకున్నాడు. కళ్ళు తెరిచే సరికి సాయంత్రమయ్యింది. భక్తకోటి భక్తి పారవశ్యానికి కొండపై హుండీ నిండిపోయింది. రామయ్య పరిచిన బట్టపై పన్నెండు రూపాయలకు మానవత్వం విలువ పడిపోయింది.

పన్నెండు రూపాయలను ఆ గుడ్డతోనే మూటగట్టాడు రామయ్య. తన కోసం ఎదురుచూస్తున్న రాజవ్వ గుర్తొచ్చింది. ఒకచోట బండిపై ఇడ్లీలు, దోశలు వేస్తున్నారు. అక్కడికెళ్ళి మూట విప్పి పన్నెండు రూపాయల్ని ఇచ్చాడు. ఏం కావాలని అడిగారు. ఇడ్లీల వైపు వేలు పెట్టి చూపించాడు. నాలుగు చిన్న ఇడ్లీలు, సాంబార్ ప్యాకెట్ కట్టి ఇచ్చారు.

జాగ్రత్తగా పొట్లాన్ని తెచ్చి రాజవ్వకిచ్చి తినమన్నాడు. 'నువ్వురా' అన్నట్టు కనుసైగలతో చెప్పింది. 'నాకొద్దు నేను తిన్నా' అన్నాడు. అది అబద్ధమని రాజవ్వ తెలుసుకోవడానికి పెద్ద సమయం పట్టలేదు. చివరికి చెరో రెండు ఇడ్లీలతో కడుపు నింపుకున్నారు.

పెద్ద నుయ్యిని పూడ్చడానికి రెండు పిడికెళ్ళ మన్ను పోస్తే ఎలాగైతే సరిపోదో ఆ ఇడ్లీలు కూడా వారి ఆకలిని ఏ మూలనా పూడ్చలేకపోయినా వాటితోనే సరిపెట్టుకున్నారు.

మరుసటి రోజు ఉదయాన్నే రామయ్యకు ఓ శుభవార్త వినిపించింది. ఓ ప్రముఖ రాజకీయ నాయకుడు సంవత్సరం క్రితం చనిపోయాడు. ఆయన ప్రథమ వర్ధంతిని అతని కుమారుడు ఘనంగా నిర్వహిస్తున్నాడు. ఊర్లో చాలామంది ఈ విషయాన్ని చెప్పుకోవడాన్ని విన్నాడు రామయ్య. బండ కింద దాచిపెట్టిన కవర్‌ను చేతపట్టాడు. భార్య ఎలాగూ అంత దూరం నడవలేదని తెలుసు, తానెళ్ళి తీసుకొస్తానని భార్యకు భరోసా ఇచ్చాడు. తనను ఇక్కడే ఉండమని చెప్పాడు రాజవ్వ సరేనంది.

రామయ్య బయలుదేరాడు. అరగంటకల్లా వర్ధంతి కార్యక్రమం జరిగే ప్రాంగణం దగ్గరకు చేరుకున్నాడు. ఆ చుట్టూ ప్రక్కల పరిసరాలన్నీ క్షుణ్ణంగా పరిశీలిస్తున్నాడు. తాను వెతుకుతున్న మెతుకుల దిబ్బ ఎక్కడా కనిపించలేదు. జనాలందరూ తండోపతండాలుగా లోపలికి తినడానికి వెళ్తున్నారు. తిన్నవాళ్ళు బయటకూ వస్తున్నారు. ఏం చేయాలో రామయ్యకు దిక్కుతోచడం లేదు. తాను కూడా లోపలికి వెళ్తే ఎవరైనా అడ్డుకుంటారేమోనని ఆలోచించాడు. తన ఆకలి కన్నా తన భార్య ఆకలి కళ్ళముందు కన్పించింది. అందరితోపాటూ తాను కూడా లోపలికి వెళ్ళడానికి నిర్ణయించుకున్నాడు.

రామయ్య అనుకున్నట్లే జరిగింది. ఆకారాన్ని చూసి ఇద్దరు పెద్ద మనుషులు రామయ్యను లోపలికి వెళ్ళకుండా గేటు దగ్గర అడ్డుకున్నారు.

"వారం రోజులవుతుందయ్యా కడుపులో మెతుకులు పడి" అన్నాడు రామయ్య

"ఆ సరే సరే అందరూ అయ్యాక పిలుస్తాము గానీ ఆ ప్రక్కనే కూర్చొని ఉండు" అని చెప్పారు ఆ ఇద్దరు పెద్ద మనుషులు. ఏడు రోజులు ఆకలి బాధను తట్టుకున్న వారికి ఒక్క గంట ఓ లెక్కనా. రామయ్య వాళ్ళు చెప్పినట్లే అటు వెళ్ళి కూర్చున్నాడు. పన్నెండు గంటలకు అక్కడికి వచ్చిన రామయ్య మూడు గంటలు వరకూ అలాగే వేచి ఉన్నాడు. తనను అక్కడే ఉండమన్న వాళ్ళు కనిపించలేదు, పిలవలేదు, అక్కడి నుండి

ప్రక్కకు వెళితే మళ్ళీ వాళ్ళకు కనిపించకుండా పోతే వెళ్ళాడనుకుంటారేమోనని రామయ్య అక్కడ నుండి కట్టు కదలకుండా అలాగే కూర్చొని ఉన్నాడు.

రామయ్యను అక్కడ ఉండమని చెప్పిన వాళ్ళు మాత్రం ఆ విషయాన్ని ఎప్పుడో మరిచిపోయారు. భోజన కార్యక్రమం దాదాపుగా పూర్తయ్యింది. జనాలు కూడా అయిదారుగురు తప్ప ఎవరూ లేరు. ఇద్దరు పెద్ద మనుషుల్లో ఒకాయన బయటికొచ్చి రామయ్యను చూశాడు.

"నువ్వు ఇంకా ఇక్కడే ఉన్నావా, తిన్లేదా....రా...లోపలికి" అన్నాడు. పూర్తిగా నీరసించిపోయిన రామయ్య అతి కష్టం మీద పైకి లేచి ఆ పెద్దమనిషి వెంట లోపలికి వెళ్ళాడు. వందలమంది భోజనాలు చేసినా ఇంకా చాలా అన్నం మిగిలి ఉంది.

"ఆ ప్లేట్లో అన్నం పెట్టి ఈ ముసలాయనకియ్యండి" అని పెద్ద మనిషి పనివాళ్ళకు చెప్తున్నాడు.

"ఈ సంచిలో పెట్టించయ్యా. నేను ఈడ తిన్ను. నా భార్య ఉంది మేం కలిసి తింటాం" అన్నాడు రామయ్య

"నువ్ ఎంత తింటావో అంత ఇక్కడే తిను. బయటకు తీసుకెళ్ళడానికి కుదరదు" అన్నాడు ఆ పెద్ద మనిషి కర్కషంగా.

"నా భార్య లేకుండా నేనెప్పుడూ తిన్లే. బాగా నీరసించిపోయింది. దయచేసి కొంచమైన పెట్టించడయ్యా" రామయ్యకు ఆ మాటలు అనాలనిపించకపోయినా అప్రయత్నంగా వచ్చేశాయి.

"పాపం ముసలాయనవు కదా అని లోపలికి పిలిచి అన్నం పెడతా ఉంటే నేను సెప్పిందే యిననంటావే? నీ యిష్టం తినాలంటే తిను. లేదంటే...పో...బయటకు పెట్టడం మాత్రం కుదరదు" అన్నాడు పెద్ద మనిషి తన సొమ్మంతా పోతున్నట్లుగా.

ఆకలి మనిషిని చంపుతుందేమోగానీ, ఆత్మాభిమానాన్ని చంపలేదు. ఆ మాత్రం బ్రతిమలాడటం కూడా రామయ్యకు ఇష్టం లేదు. కానీ తప్పలేదు. ఇలాంటి పరిస్థితి తనకు వస్తుందని తానెప్పుడూ ఊహించలేదు. మారు మాట్లాడకుండా తిరుగుముఖం పట్టాడు. రామయ్య పట్టుదల చూసి ఆ పెద్ద మనిషికి ఆశ్చర్యం వేసింది. హృదయం ద్రవించింది.

'ఓ ముసలాయనా...' పిలిచాడు



రామయ్య పలుకలేదు

'రా తీసుకెల్దువురా యింటికే' అన్నాడు

రామయ్యకు శబ్దం వినిపించింది కానీ అదేమిటో అర్థం చేసుకొనే పరిస్థితిలో లేడు. "ఇంత పంతమైతే బతకటం కష్టమబ్బా" అని మనసులో అనుకున్నాడు పెద్ద మనిషి.

శరీరంలో కొంచెం కూడా సత్తువలేని రామయ్య నడుస్తూ తిరిగి వెల్తుంటే శవం నడుచుకుంటూ వెళ్ళినట్లుంది. శరీరం నడుస్తుంది గానీ ఆత్మ ఎక్కడికో పని మీద వెళ్ళిందా? అన్నట్లుగా ఉంది. రోడ్డుకు అటువైపు వెళ్ళాలి రామయ్య. రోడ్డుకు అటువైపూ, ఇటువైపూ చూడలేదు కళ్ళు. దాటడానికి ప్రయత్నం చేస్తున్నాయి కాళ్ళు. డ్రైవర్‌ను యముడు ఆవహించాడు. ఇప్పుడు తన వాహనం దున్నపోతు కాదు లారీ. ఓ సైనికుడు యుద్ధంలో వీరమరణం పొందాడు.

✻ ✻ ✻

రాజవ్వ గుండె తనకు తెలియకుండానే కలుక్కుమంది. వెళ్ళిన తన భర్త ఇంకా తిరిగి రాలేదు. వస్తాడనే ఎదురు చూస్తోంది. తను అక్కడ నుండి వెళితే, భర్త తన కోసం వెతికి కంగారుపడతాడేమోనని ఆమె భయం. అందుకే ఎక్కడికీ కదల్లేదు. అయితే ఈ రోజు ఆమె శరీరంలోని అవయవాలన్నీ జీతాలివ్వలేదని పోరాడే కార్మికుల్లా స్ట్రైక్ చేయాలని నిర్ణయించుకున్నాయి. ఆ విషయాన్ని వాటికి యజమాని అయిన రాజవ్వ కూడా గుర్తించింది.

ఆ సమయంలో ఆమెకు చిన్న ఆశ కలిగింది. ఆ ఆశ ఏంటోగాని చాలా శక్తివంతమైనదున్నట్లుంది. అందుకే రాజవ్వకు శక్తి లేకపోయినా శక్తి తెచ్చుకొని మరీ పైకి లేచి నిలబడింది.

మొదటి అడుగు వేసింది. పది నిమిషాల్లో ఇరవై అడుగుల దూరం వెళ్ళింది. ఇది ఆమె ఆశకున్న శక్తి. అక్కడ కాసేపు ఆగి మళ్ళీ నడక మొదలుపెట్టింది. చిన్న చిన్న చినుకులే చివరకు వరదలాగా మారినట్లు, చిన్న చిన్న అడుగులే చివరకు గమ్యాన్ని చేరుస్తాయి. ఈ సిద్ధాంతాన్ని ఆమె అనుసరిస్తూ ఉంది. ఆమె మెల్లగా నడుస్తూ ఉంది. అయితే నత్తకు మించిన వేగం ఆమె నడకలో ఉంది. ఆమె ఎక్కడికి వెళ్ళాలనుకుంటుందో ఆమెకు తప్ప మరెవరికీ తెలీదు. ✻

# కవిత్వం రాస్తే చాలదు- ప్రజలకు చేర్చాలి!




వంద సినిమాల వరకూ రచనలు అందించడమే గాక నిర్మాతగా దర్శకుడుగా నటుడుగా కూడా పరిచితుడైన సాహిత్య ప్రాణి జనార్ధన మహర్షి. సినిమాయాలోకంలో జయప్రదంగా నెట్టుకువచ్చి కూడా మౌలికంగా సాహిత్య సృజనలోనూ నిరంతరం పరితపించే అక్షర ప్రేమికుడు. ఈ తపనే ఆయనను వెన్నముద్దల కవిని చేసింది. *2003*లో మొదటి ముద్రణ వెలువడిన ఈ కవితా సంపుటి *2016* జూన్ నాటికి పదకొండవ ముద్రణ పొందింది. తెలుగు కవిత్వంలో ఇంతకాలం ఇన్ని ముద్రణలు పొందిన పుస్తకాలు ఒక చేతి వేళ్లమీద లెక్కపెట్టేటన్ని కూడా లేవు. ఈ అసాధారణ విజయం వెనక నిరంతర తపనతో పాటు ప్రణాళికా బద్ధమైన కృషి వుంది. ప్రచార వ్యూహం వుంది. వాటిని తెలుసుకోవలసిన అవసరమూ వుంది. ఆయన ప్రస్థానంతో సహా అనేక పత్రికలలో రచయితలకు నెలనెలా నగదు బహుమతులు అందేందుకు ఆర్థిక సహాయం చేస్తున్న సహృదయుడు. ఈ ప్రత్యేక సందర్భంలో ప్రస్థానంతో మహర్షి ముఖాముఖి.

**మామూలుగా కవులుగా పేరు వచ్చాక సినిమాల్లో అవకాశం కోసం ప్రయత్నిస్తుంటారు. తర్వాత కవిత్వంపై పెద్దగా శ్రద్ధ చూపరు. కాని మీరు వంద సినిమాల తర్వాత కవిత్వంపై ఇంత మక్కువ చూపడం, వెన్నముద్దలు ఇంతగా ప్రజల్లోకి తీసుకెళ్లడంలో ఇంత మంచి ఫలితాలు సాధించడం ఎలా జరిగింది?**

నేను మొదట సాహిత్యం చదువుకుని అటు నుంచి సినిమాల వైపు వచ్చిన వాణ్ని. గొప్పవాళ్లనుకున్న చాలామంది రచనలు చదివాకే వచ్చాను. సినిమాల్లోనూ ఒక దశ వరకూ వెళ్లిన మాట నిజమే. అయితే సినిమా అనేది ఒక్క వ్యక్తి రాసేది కాదు. అనేకమందికి నచ్చాలి. చర్చించాలి. ఆ సంభాషణలు మలుపులు ఎలా వుండాలనే దానిపై ఎంతో కసరత్తు వుంటుంది. ఉదాహరణకు ఒక హీరో మాట్లాడేమాటలు ఆ హీరో పాత్రవే కాని నావి కాదు. కనుక అక్కడ సంతోషం చాలా వున్నా రచయితగా సంపూర్ణమైన సంతృప్తి రాకపోవచ్చు. కాని కవిత్వం పూర్తిగా నా స్వంతం. ఇక్కడ సంపూర్ణమైన సంతోషం వుంటుంది.

***రెండింట్లో ఏది బాగుంటుంది?***

నిజం చెప్పాలంటే దాంట్లో వున్నప్పుడు ఇది బాగుంటుంది. దీంట్లో వున్నప్పుడు అది బాగుంటుంది. .

**వెన్నముద్దలు తొలి ముద్రణల్లో ప్రతి పేజీలో ఒక కవి చిత్రం వేసి కొత్త ప్రయోగం చేశారు. దానికోసం ఆ పుస్తకం అందరికీ గుర్తుండిపోయింది. మేము సాహితీస్రవంతి కవుల ఎగ్జిబిషన్ ఏర్పాటు చేసినప్పుడు కొన్ని ఫోటోలకోసం వాడుకున్నాము. తర్వాత వాటిని ఎందుకు తీసేశారు? మీ పుస్తకానికి కావలసినంత ప్రాచుర్యం వచ్చిందనా?**

ఈ ప్రశ్న ఒక విధంగా చాలా అవసరమైంది. వివరణ ఇచ్చుకునే అవకాశం దొరికింది. నేను మొదటగా వెన్నముద్దలు విడుదల చేస్తున్నప్పుడు అది నా మొదటి పుస్తకం. నేను కవిగా పరిచయమైన వాణ్ని కాదు. మరి నా పుస్తకం ఎందుకు కొంటారు? అని సందేహం వచ్చింది. ఎవరైనా కొన్నా చదివిన తర్వాత దాన్ని అట్టిపెట్టకోవాలనిపించకపోవచ్చు కదా.. అందుకే ఒక కొత్త ప్రక్రియ చేద్దామనుకున్నాను. తెలుగులో బాగా పరిచితులైన కవుల చరణాలు ఇద్దామనుకున్నాను. తర్వాత వారి పేర్లు పుస్తకాల జాబితా చివరలో చేర్చితే బాగుంటుందని ఆలోచించాను. ఇలా అనేక తర్జనభర్జనల తర్వాత ప్రతి పేజీలో కవితపైన ఒక కవి లేదా రచయిత ఫోటో ప్రచురించాను. దీనికి ఇంకో కారణం వుంది. నేను కాస్త పెద్దవాణ్నయ్యాక అంటే కాసిన్ని విషయాలు తెలుసుకున్నాక ఒక పెద్దాయన ఇంటికి వెళ్లాను. అక్కడ ఒక ఫోటో చూసి ఎవరీయన అని అడిగాను. ఆయనే విశ్వనాథ సత్యనారాయణ అని ఆ పెద్దాయన చెప్పారు. దాంతో నాకర్థమైంది మనకు రచయితలుగా తెలిసిన వారివి కూడా ఫోటోలు గుర్తుపట్టలేమని. అన్నీ ఒక చోట వుంటే ఆసక్తి గలవారు తెలుసుకుంటారని.



జనార్దన మహర్షి

***మరి మీ ప్రయోగానికి ఎలాటి స్పందన వచ్చింది?***

అందరూ అభినందించారు. చాలా మంచి ప్రయోగమన్నారు. అనుకున్నట్టే ఆ ఫోటోల కోసం కూడా పుస్తకం తీసుకున్నారు. అయితే తెలియని వారు పైన ఫోటోలు చూసి ఆ కవిత వారే రాశారని అనుకోవడం మొదలుపెట్టారు. విశాఖలో ఒక స్థానిక పత్రిక ఈ పుస్తకంలోని కవితలను రోజుకొకటి చొప్పున పైనున్న ఫోటోలని రచయితల పేరిట ప్రచురించడం మొదలుపెట్టింది. నేను వాళ్లతో మాట్లాడాక గందరగోళం ఎలా వచ్చిందో అర్థమైంది. ఇంతమందికి వ్యక్తిగతంగా సమాధానం చెప్పలేను గనక ఫోటోలు తీసేయడమే మంచిదని నిర్ణయానికి వచ్చాను. వాటిని జోడించడంలో నా ఉద్దేశం ఏమిటో సరిగ్గా అర్థమయ్యేట్టు చెప్పలేకపోవడం నా వైఫల్యమా లేక వాటిద్వారా ఆకర్షించడం నా విజయమా చెప్పలేను.

***మీ కవితలు చదువుతుంటే ఏదో ఘర్షణ కొంత వేదాంత ధోరణి కనిపిస్తాయి.. మరోవైపున సామాజికాంశాలు కూడా అగుపిస్తాయి. మీకంటూ ఏదైనా శైలి ఎంచుకున్నారా?***

నాకే ఘర్షణా లేదు. అనుభవాలను బట్టి చదివిన వాటిని బట్టి వచ్చిన భావాలు రాసుకుంటూ పోయాను. కొన్నిసార్లు తనికెళ్ల భరణితోనో మీలాటి వారితోనో మాట్లాడిన తర్వాత కలిగే ప్రేరణ కూడా కవితల రూపం తీసుకుంటుంటుంది. వాటిలో ఏదైనా సామాజిక స్పృహ ఘర్షణ వంటివి కనిపించాయంటే కావాలని రాసింది కాదు. సున్నితంగానో లేక లలితంగానో కాదంటే సంఘర్షణగానో ఫలానా విధంగా రాయాలని నేను అనుకోలేదు. సమాజంలో వ్యక్తిగా జీవితంలో చూసిన విన్న చదివిన వాటిని రాస్తూ వెళ్లాను గనక అలా అనిపిస్తుంది. ఒక వ్యక్తి సామాన్యుడే కావచ్చు గాని అతని జీవితంలోకి అనేకమంది అద్భుతమైన వ్యక్తులు వచ్చే అవకాశం వుంటుంది. అది కూడా ఈ కవితల్లో ప్రతిబింబించొచ్చు.

***రాయడం ఒకటైతే ఇన్ని ముద్రణలు పొందడం కూడా చాలా అసాధారణం కదా..***

మూడో ముద్రణ తర్వాత నేను ఆలోచించాను. ఇంకో పుస్తకం రాయాలా లేక దీనికే కలపాలా అని. చివరకు దీన్నే మరింత విస్తరించాలని నిర్ణయించుకున్నాను. ఎన్ని రచనలు చేసినా ఏవో ఒకటి రెండే ప్రజలు గుర్తు పెట్టుకుంటారు. శ్రీశ్రీ మహాప్రస్థానం, బుచ్చిబాబు చివరకు మిగిలేది, గోపీచంద్ అసమర్థుని జీవయాత్ర, నవీన్ అంపశయ్య ఇలా. కనుక వెన్నముద్దలు నా పేరుతో ముడిపడిపోయేలా ఎప్పటికప్పుడు దీన్నే అదనపు కవితలు చేర్చి కొనసాగిస్తుంటాను. ఇలా వందవ ముద్రణ వరకూ వెళ్తుందని నా విశ్వాసం. తప్పక జరుగుతుంది. కవిత్వం ఎంత రాసినా వెన్నముద్దలు గానే తీసుకొస్తాను.

***దీన్ని ప్రమోట్ చేసేందుకు కూడా చాలా నూతన ప్రక్రియలు చేపట్టినట్టున్నారు...***

పుస్తకం ప్రజలకు చేరాలంటే ప్రమోషన్ చాలా ముఖ్యం. రాయడంపై పెట్టిన శ్రద్ధ జనానికి చేర్చడంపైనా చూపించాల్సి వుంటుంది. నా కోర్కె ఒకటే- ఉప్పు చక్కెర చింతపండు దొరికే చోటల్లా కవిత్వం కూడా దొరకాలి. అందుకే సూపర్ బజార్‌లలో మాల్స్‌లో ఈ పుస్తకం పెట్టించాను. సినిమా పోస్టర్ తరహాలో పోస్టర్ వేయించాను. మొదట తీసుకోవడానికి సంకోచించిన మాల్స్ వారే తర్వాత అన్నీ అయిపోయాయంటూ మళ్లీ అడిగారు.

***దీనంతటికీ అవసరమైన డబ్బు అందరికీ వుండదు కదా..***

అదో పొరబాటు అభిప్రాయం. నేను డబ్బు వుందని ఇష్టానుసారం వెచ్చించలేదు. పుస్తకానికి మామూలుగా ఎంత కేటాయిస్తామో దాంట్లోనే చేశాను. పుస్తకం ముద్రణ ఖర్చు, ఆవిష్కరణ సభ, దానికి నిర్వహణ ఖర్చులు అల్పాహారాలు , కరపత్రాలు ఇవన్నిటికీ డబ్బు ఖర్చు చేస్తారు రచయితలు. దీనికి ఎంత ఖర్చు అవుతుంది? ఎంతమంది వస్తారు? స్థానిక పత్రికలో ఓ మూల చిన్న వార్త వస్తే ఎవరు గమనిస్తారు? ఈ ఖర్చును యాడ్స్‌కు ఉపయోగించొచ్చు. విక్రేతలకు అధికంగా కమిషన్ ఇవ్వొచ్చు. అప్పుడు వారే మరింత ఆసక్తిగా ప్రజలకు అందిస్తారు.

***మరి ఇప్పటి వరకూ వచ్చిన పదిముద్రణల తర్వాత పాఠకుల నుంచి ఎలాటి స్పందన పొందగలిగారు?***

2003లో మొదలై ఇప్పుడు 11 ముద్రణ వరకూ వచ్చినా రోజూ ఫోన్లు వస్తూనే వుంటాయి.ఎవరెవరో చేస్తుంటారు. వారివారి అభిరుచిని ఆసక్తినిబట్టి కవిత చదవడంతో ప్రారంభిస్తారు. ఒక్కొక్కరికి నచ్చేవి ఒక విధంగా వుంటాయి. వారి వారి ఉచ్చారణలు కూడా విభిన్నంగా తమాషాగా సంతోషంగా అనిపిస్తాయి. సాహిత్య సినీమా ప్రముఖులు కూడా చాలా ఇష్టంగా చెబుతుంటారు. ఇందులో 30,40 కవితలు వచ్చిన వారున్నారు. ప్రకాశ్ రాజ్ అయితే ఎంతో ఇష్టపడ్డమే గాక హాయ్ బెంగుళూరు ఎడిటర్ రామ్ బెళగల్‌కు చదవడానికి ఇస్తే ఆయన వాటిని రోజుకో కవిత చొప్పున వేసుకుంటానని నాకు ఫోన్ చేశారు. దానికి పారితోషికం బాగా ఇస్తానన్నారు. నిజానికి కన్నడంలో ఏది వేసుకున్నా అనువదించుకున్నా మూల రచయితకు పారితోషకం ఇస్తారు.

ఇక్కడే ఒక మాట చెబుతాను. నేను సినిమాలకు కథలు రాసి లక్షలు సంపాదించినప్పుడు ఎంత ఆనందిస్తానో కవితలు వేస్తున్నప్పుడు ఆదరణపొందుతున్నప్పుడు అంతే సంతోషించాను. పత్రికల్లో వేసుకున్నా ప్రతిఫలం ఇవ్వకపోవడం నాకు ఆశ్చర్యం అభ్యంతరం అనిపిస్తుంది. సినిమా అన్నది సమిష్టి కృషి. కవిత్వం నా స్వంతం. ఇది ఒక తపన. ఆరాటం.

***మీరు రాసినప్పుడు ఏ దృష్టి లేకుండా రాశానన్నారు.. ప్రత్యేకంగా శైలి సారాంశం వంటివాటి గురించి ఆలోచించలేదన్నారు. పుష్కరకాలం తర్వాత ఇప్పుడేమైనా అలాటిది గుర్తించగలిగారా?***

నా వెన్నముద్దలు మొదటి మూడు ముద్రణలు 2013లో వెలువడ్డాయి. అప్పుడు అన్ని పత్రికల్లో సమీక్షలు వచ్చాయి. మళ్లీ 2005లో మరోసారి వేసినప్పుడు కూడా సమీక్షలు వచ్చాయి. 2015లో పదవ ముద్రణ వేశాక 17 సమీక్షలు వచ్చాయి. వీటిని రాసినవారంతా చెప్పుకోదగిన వారే. సమీక్షల సమయంలో వారంతా ఏవో కొన్నికవితలు ఉటంకిస్తూ విశేషాలు విశ్లేషించారు. తమాషా ఏమంటే ఒక్క కవిత కూడా పునరావృతం కాకుండా ఎవరికి వారు వేర్వేరు కవితలు తీసుకుని కొత్త విషయాలు చెప్పారు. ఇది చూశాక ఈ కవితల్లో ఏదో శైలీ విశేషం వుందని అనుకున్నాను.

***మరి మీ భవిష్యత్ ఆలోచనలు.. ప్రణాళికలు...***

ఇదేగాక సాహిత్యం ప్రజలకు చేర్చేందుకు ప్రత్యేకంగా పుస్తక ప్రదర్శనలు నిర్వహించాలని వుంది. దానికి మీరు కృషి చేసినా మరెవరు చేసినా నేను సహకరిస్తాను. పుస్తకాల పంపిణీ మార్కెటింగ్ గురించి నాకు చాలా ఆలోచనలు వున్నాయి. వాటిని అమలులోకి తెచ్చే ప్రయత్నం చేస్తాను.

చివరంగా ... నాకు ఒక కల వుంది. ఇప్పటికి కాకపోతే మరో పదేళ్లకు యాభై ఏండ్లకు అయినా సరే తెలుగునాట తలిదండ్రులు తమ పిల్లలు డాక్టర్లు ఇంజనీర్లు కావాలని అనుకున్నట్టే కవి కావాలని కోరుకోవాలి. కవి ఒక హీరో కావాలి. సూపర్ స్టార్ మెగాస్టార్‌లతో సమానమైన స్థాయికి చేరుకోవాలి. అందరినీ ముఖ్యంగా కవులను రచయితలను నేను కోరేదొక్కటే. రాయడం మీద పెట్టే శ్రద్ధ ప్రజలకు చేర్చడంపైనా చూపించండి.

**ముఖాముఖి: తెలకపల్లి రవి**

# ఒక కలానికి ఊపిరులూదిన తీర్పు



మూర్ఖత్వం నల్లగా దట్టంగా అలుముకున్నప్పుడు ఏ కొంచెం కామన్‌సెన్స్ అయినా కొట్టొచ్చినట్టు ప్రకాశిస్తుంది. తమిళ రచయిత పెరుమాళ్ మురుగన్ కేసులో మద్రాసు హైకోర్టు వెలువరించిన తీర్పు కూడా వర్తమాన పరిస్థితుల మధ్య అలాంటి వెలుగే. ఏడాదిన్నర క్రితం పెరుమాళ్ మురుగన్ రచయితగా తాను మరణించినట్టు ఫేస్‌బుక్‌లో చేసిన ప్రకటనతో ఒక అణచివేత వెలుగులోకి వచ్చింది. ఆయన నవల 'మాధోరుబగన్' 1940ల్లో తిరుచెంగోడ్ పట్టణంలో పిల్లలు లేని దంపతులు కాళి, పొన్నల కథ చెబుతుంది. ఇద్దరూ ఎన్ని గుళ్లు తిరిగినా, ఎవరికి మొక్కినా ఫలితం దక్కదు. చివరికి ఒకటే దారి కనిపిస్తుంది. తిరుచెంగోడ్ అర్ధనారీశ్వరుడికి జరిగే రథోత్సవ వేడుకల్లో 14వ రోజున సాంఘిక కట్టుబాట్లు వదులవుతాయి. ఆ రాత్రి ఎవరు ఎవరితోనైనా శృంగారంలో పాల్గొనవచ్చు. ఈ వేడుక కాళి, పొన్నల సంసారంలో ఏ మార్పు తీసుకొచ్చిందన్నది అసలు కథ. ఇలాంటి సంప్రదాయం ఏదీ లేదని, పెరుమాళ్ మురుగన్ కల్పితకథతో తమ దేవుడ్నీ, స్త్రీలను అవమానించాడని కొన్ని హిందూసంస్థలు గొడవకు దిగాయి. పెరుమాళ్ మురుగన్ చేత పోలీసుల సమక్షంలో క్షమాపణ చెప్పించాయి. అయినా గొడవ కోర్టుకెక్కి ఏడాది పాటు విచారణ సాగింది. మొన్న జూలై 5న మద్రాసు హైకోర్టు కేసు కొట్టివేస్తూ చరిత్రాత్మకమైన తీర్పునిచ్చింది. చీఫ్ జస్టిస్ ఎస్.కె.కౌల్, జస్టిస్ పుష్పా సత్యనారాయణలతో కూడిన ధర్మాసనం ఇచ్చిన 160 పేజీల తీర్పు నుంచి ఏరికూర్చిన పాఠ్యానికి ఇది అనువాదం.

– వివిధ

సమాజం ఒక పుస్తకాన్ని చదివి అదేమి చెబుతున్నదో నొచ్చుకోకుండా ఆకళింపు చేసుకోవటానికి సిద్ధమేనా కాదా అన్నది ఎన్నో ఏళ్లుగా ఉన్న చర్చే. కాలం మారుతున్నది. ఒకప్పుడు ఒప్పుకోలేనిది తర్వాత సమ్మతి పొందుతున్నది. 'లేడీ ఛాటర్లీస్ లవర్' దీనికి ఒక ప్రముఖ ఉదాహరణ. ఒక పుస్తకం చదవాలా వద్దా నిర్ణయించుకునే వెసులుబాటు పాఠకునికి ఎప్పుడూ ఉంది. ఒక పుస్తకం నీకు నచ్చకపోతే, విసిరి పారేయ్. బలవంతమేమీ లేదు. సాహిత్యాభిరుచులు మనిషి మనిషికీ మారతాయి– ఒకరికి సరైనది మరొకరికి కాకపోవచ్చు. అయితే రాసే హక్కుకు ఏ ఆటంకమూ లేదు. ఒకవేళ పుస్తకంలోని అంశాలు రాజ్యాంగ విలువలని కాలరాస్తున్నా, వర్గ ఘర్షణల్ని లేవనెత్తుతున్నా, కులాలను కించపరుస్తున్నా, సమర్థనీయంకాని శృంగారాన్ని చిత్రిస్తున్నా, లేదా దేశ అస్తిత్వంపైనే దాడి చేస్తున్నా, రాజ్యం ఖచ్చితంగా కలగజేసుకుంటుంది, అందులో సందేహం లేదు.

ప్రస్తుతం మా ముందున్నది చిత్రమైన కేసు. ప్రొఫెసర్ పెరుమాళ్ మురుగన్ రాసిన 'మాధోరుబగన్' ఒక తమిళ నవల, ఇది 'వన్ పార్ట్ వుమన్' పేరుతో ఇంగ్లిషులోకి తర్జుమా

అయింది, ఎన్నో పురస్కారాలు కూడా దక్కాయి, అయినాకూడా ఈ పుస్తకం ప్రమాదకరమనీ, వినాశకరమనీ, కథ జరిగిన స్థలానికి చెందిన ప్రజల మనోభావాల్ని రెచ్చగొడుతున్నదనీ ఆరోపణలు వచ్చాయి.

**ఆశ్చర్యకరంగా, స్త్రీ పురుష సంబంధాలు, శృంగారమూ, మతపరమైన ఆచారాల విషయాల్లో ప్రాచీన ధార్మిక గ్రంథాలే వర్తమానంతో పోలిస్తే ఎంతో ఉదారంగా ఉన్నాయి.**

ఈ నవలకు చరిత్ర ఆధారమా, అయితే ఏమిటి? కొన్ని సంఘటనలు జరిగాయనటానికి ఎప్పుడూ నమోదైన చరిత్రే రుజువుగా ఉండితీరాలా, లేక మనిషి నుంచి మనిషికి అందే జానపద వృత్తాంతాలు కూడా ఒక పుస్తకానికి ఆధారం కావొచ్చునా? ఏదేమైనా, మన మనసు నొచ్చుకునే పరిస్థితి నుంచి ఎలా తప్పించుకోవచ్చు? "ఒక పుస్తకానికి నొచ్చుకోకుండా ఉండటం చాలా సులువు, దాన్ని మూసేస్తే చాలు?" అన్న సాల్మన్‌రష్దీ మాట మనకేమైనా పనికొస్తుందా?

చిత్రకారుడు ఆలోచనల్ని గీస్తాడు. శిల్పి చెక్కుతాడు. అలాగే రచయిత రాస్తాడు. మొదటి రెండు సందరాల్లోనూ ఆలోచనలు సరళమైన నిర్మాణంతో వ్యక్తమవుతాయి. పుస్తకం ఆలోచనల్ని చెప్పటానికి మరింత వివరమైన విశదమైన పద్ధతి. అది సరళ నిర్మాణం కాదు. ఒక ఇతివృత్తాన్ని నింపాదిగా అల్లుతుంది. అందుకే, ఒక పుస్తకాన్ని అశ్లీలతే కాదు, మరింకే ప్రమాణాల ద్వారానైనా నిగ్గుతేల్చాలంటే ముందు దాన్ని ఆసాంతంగా చదివి, ఆకళింపు చేసుకోవాలి. పుస్తకాన్ని ఏదో చట్టశాసనం చదివినట్టు చదివి ఒక నిర్ధారణకు రాలేము. అక్కడో వాక్యమూ ఇక్కడో వాక్యమూ ఎత్తిచూపి అంచనా వేయలేము. పుస్తకాల్లో వాడే భాష కూడా సందర్భాన్ని బట్టి ఒక్కోసారి మర్యాదగా మెరుగుపెట్టిన భాషలాగానూ, మరోసారి స్థానిక యాసలతో మోటుగానూ ఉండవచ్చు. దూషణపూరితమైన భాష విషయంలో ఎలాగూ కొన్ని హద్దులున్నాయి. కానీ మరోలా చూస్తే, వాస్తవాలెప్పుడూ పూలపాన్పు కాదు, అవి కటువుగానే ఉంటాయి. అందుకే, స్త్రీల సమస్యలు, లేదా సామాజికంగానూ ఆర్థికంగానూ వెనుకబడిన వర్గాలవారి యాతనలూ ఇలాంటి సామాజికాంశాల గురించి రాసిన పుస్తకాలు పైకి కటువుగా కనిపించవచ్చు. ఒక్కోసారి సందేశాన్ని పాఠకులకు చేర్చేందుకు వారు బిత్తరపోయేట్టుగానే వాస్తవాల్ని చూపించాల్సి వస్తుంది. ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడి, సంఘ వివక్షను ఎదుర్కొంటున్న పిల్లలు లేని దంపతుల కష్టాలని కూడా "సమున్నతమైన" పద్ధతిలో చెప్పితీరాలా?

అశ్లీలపు హద్దుల్ని తాకకుండా ఏమేరకు శృంగార రీతుల్ని పుస్తకాల్లో చిత్రించవచ్చన్నది ఈ వివాదంలో మరో అంశం. ఇది ఆయా సమాజాల సంస్కృతీ సంప్రదాయాలపైనా, వర్తమానం లోని కట్టుబాట్ల పైనా ఆధారపడి ఉంటుంది. అయితే వర్తమానపు కట్టుబాట్లు ఎప్పుడూ కొంత గతం తాలూకు బరువు కూడా మోస్తూంటాయి.

స్వాతంత్ర్యం తరువాత రాజ్యాంగ నిర్మాతలు రాజ్యాంగంలోని భాగం-3లో ప్రాథమిక హక్కులకు ఎంతో గొప్ప స్థానమిచ్చారు. వాక్ స్వాతంత్ర్యమూ, వ్యక్తీకరణ స్వాతంత్ర్యమూ రాజ్యాంగానికి ఆయువుపట్టు, దీన్ని న్యాయస్థానాలు బలంగా సమర్థిస్తూ వచ్చాయి. అయితే ఏ స్వేచ్ఛా హద్దుల్లేనిది కాదు. అందుకే వ్యక్తీకరణ స్వాతంత్ర్యానికి కూడా ఆర్టికల్ 19(2) ద్వారా పరిమితి విధించారు. ఆశ్చర్యకరంగా, స్త్రీ పురుష సంబంధాలు, శృంగారమూ, మతపరమైన ఆచారాల విషయాల్లో ప్రాచీన ధార్మిక గ్రంథాలే వర్తమానంతో పోలిస్తే ఎంతో ఉదారంగా ఉన్నాయి. అందం చూసేవాడి కళ్లల్లో ఉంటుందంటారు, ఏది అశ్లీలత అనేది తేల్చటానికి కూడా ఇదే సూత్రం వర్తిస్తుంది.

ప్రాచీన సాహిత్యంలో శృంగార రీతుల్ని స్వేచ్ఛగా చిత్రించిన సందర్భాల్ని రచయిత తరఫు న్యాయవాదులు మా ముందుంచారు. ఇంతకుముందు లేనిదేదీ రచయిత రాయలేదనీ, కానీ ప్రాచీన భారత సాహిత్యం పట్ల ఏ గౌరవమూ లేని కొన్ని గుంపులు సంకుచిత దృక్పథంతో ఈ నవలకు వ్యతిరేకంగా కత్తిగట్టాయనీ నిరూపించే ప్రయత్నం చేశారు. వేద కాలం నుంచీ శృంగారమూ, కామరసభరితమైన సాహిత్యమూ, ప్రాచీన మధ్యయుగాల్లోని శృంగారపరమైన ఆచారాలూ ఎలా ఉన్నాయో ఈ తీర్పు ముందరి భాగాల్లో విస్తృతంగా ఉటంకించాము గనుక వాటిని మరలా పేర్కొనటం లేదు. మన స్వేచ్ఛావిలువల్ని నిజంగా ప్రతిబింబించేది ఆ సాహిత్యమేనని మరోమారు చెప్తున్నాము. మనదేశంపై బ్రిటిష్ దురాక్రమణ అనంతరం చెలామణీలోకి వచ్చిన విక్టోరియన్ ఇంగ్లిష్ భావజాలం చేత కలుషితం కాని విలువలు అవి. ఒక సమాజంగా మనం మన సాహిత్యం నుంచీ, ధార్మిక గ్రంథాల

## పదండి

- నందవరం కేశవరెడ్డి
9885120878



మనిషి కాళ్ళు మనిషివి కాకుండా పోతున్నాయి
మనిషి చేతులు మనిషివి కాకుండా పోతున్నాయి
మనిషి తల మనిషిది కాకుండా పోతోంది
పొమ్మన్న చోటికి పోదు
చేయమన్నది చేస్తూ
ఆలోచించమన్నది ఆలోచిస్తూ
యెక్కడో మాంత్రికుడి చేతిలో కదులుతున్న కీలు
అవసరాలు అందుకోమంటున్నాయి
సౌకర్యాలు పరుగెత్తమంటున్నాయి
సౌఖ్యాలు జుర్రుకో మంటున్నాయి
శారీరక మానసిక ఘర్షణలో, మూగదై పోతున్న మనస్సు
చూస్తే శూలాలై గుచ్చుకునే దృశ్యాలు
వింటే అవాస్తవ ఆర్భాటాల మాటల సుత్తి పోట్లు
గుండె గాడులు పగుళ్లువారు ప్రచార హోరు
వళ్లంతా చీలలతో రక్తమోడుతున్న, ప్రశాంత సౌధ నిశ్శబ్దం
వస్తుమయ మాయా బజారులో తప్పి పోతున్న మనిషి
చీలికలు పేలికలుగా చినిగిపోతున్న విలువల వస్త్రాలు
నడి బజారులో పైశాచిక రసక్రీడ
దారి కాని దారుల్లో వసి వాడుతు
మచ్చబారుతూ విషతుల్యుడవుతూ
జారిపోతున్న మనిషి
కనుమరుగై పోతున్న మనిషి
పదండి
పరుగెత్తి పరుగెత్తి
పట్టుకుందాం పదండి. ✻

---

నుంచీ ప్రేరణ పొందటం మానేసి విక్టోరియన్ భావజాలంలో కూరుకుపోతున్నాం. శృంగారం దానికదే అవాంఛనీయంగా ఎన్నడూలేదు, నాగరికత ఆదిగా అది ఒక అంతర్భాగంగా ఉంటూనే వచ్చింది. మహాభారతంతో సహా భారతీయ ధార్మిక గ్రంథాల నిండా వివాహేతర శృంగారం గురించిన ఉదంతాలెన్నో ఉన్నాయి, అది కూడా చాలాసార్లు వంశాలను కొనసాగించటానికే. భవిష్యత్తులో ఒక పరిపూర్ణుడైన రాజుని పొందటం కోసం ఇలాంటి ఆచారాల్ని ఆనాటి సమాజంలో ఉన్నత నిమ్న సామాజిక ఆర్థిక వర్గాలు రెండూ పాటించాయి. ఇప్పుడు మహాభారతమూ, అలాంటి అనేక ఇతర గ్రంథాల్ని మన చరిత్రలో భాగమని చెప్తూనే, అవి మితిమీరిన కామాతురతని వ్యక్తం చేస్తున్నాయన్న కారణంతో వాటిని నిషేధించాలని చెప్పగలమా? మేము చెప్పగలిగినదల్లా ఇదే

**- భవత్య అధర్మో ధర్మో హి ధర్మాధర్మావుభావపి**
**కారణాత దేశకాలస్య దేశకాలః స తాదృశః**

**స్థలకాల పరిస్థితుల్ని బట్టి ఏది ధర్మమో అది అధర్మం కావొచ్చు, అలాగే ఏది అధర్మమో అది ధర్మంగా మారవచ్చు.**

**-శాంతిపర్వము, 79. 31**

ఇతర మాధ్యమాలకు ఎంత ప్రజాదరణా లాభదాయకతా వున్నా, పుస్తకాలు ఇప్పటికీ ఒక శక్తివంతమైన సాధనమే. అవి చరిత్రను తీర్చిదిద్దటంలో అసమానమైన పాత్రపోషిస్తాయి. మంచి పుస్తకాలెప్పుడూ సాధికార స్వరంతో, సహేతుకంగా, స్పష్టంగా మాట్లాడతాయి. రచయిత, పాఠకులిద్దరి ఆలోచనకూ చోటిస్తాయి. ఈ ఆన్‌లైన్ వాదోపవాదాల, బెదిరింపుల కాలంలో ప్రచురణకర్తలపై మరింత పెరిగిన బాధ్యత ఏమిటంటే- పాఠకుల చెంతకు నిజాన్ని చేర్చటమే.

రచయిత పెరుమాళ్ మురుగన్ భయపడాల్సిన పనిలేదు. అతను రాయాలి, తన రచనల పరిధిని పెంచుకుంటూ పోవాలి. అతని రచనల ఇతివృత్తాలతోనూ శైలితోనూ విభేధించే వారు ఎందరున్నా, అతని రచనలు సాహిత్యానికి ఎంతో సమకూరుస్తాయి. మా తీర్పుతో ఈ గొడవ సమసిపోతుందనీ, అన్ని పక్షాలూ ఆత్మపరిశీలన చేసుకుంటాయనీ ఆశిస్తున్నాం. చివరిగా ఈ పరిశీలనతో ఈ తీర్పును ముగిస్తున్నాం - **"Let the author be resurrected to what he is best at. Write."**

**(ఆంధ్రజ్యోతి వివిధ 11.07.2016 సౌజన్యంతో)** ✻

# అవతలి గట్టు

- డా.ఉప్పలధడియం వెంకటేశ్వర
9566198368



పడవింకా బయల్దేరలేదు.

"ఎక్కడ చచ్చాడు వీడు" బిగ్గరగా అరిచాడు శర్మ. పొగ వొదుల్తూ. పడవ సరంగు ఎంత దూరంలో ఉన్నా అతడికి తన మాటలు వినిపించి, అతడు రెక్కలు కట్టుకొని వచ్చి వాలాలని శర్మ ఉద్దేశం కాబోలు.

మొన్న గోపీనాథ బోర్డొలోయ్ అంతర్జాతీయ విమానాశ్రయంలో అతడితో నాకు పరిచయం ఏర్పడింది. మా ప్రధాన కార్యాలయం వాళ్ళు గౌహతిలో సమావేశం ఏర్పాటు చేసారు. ఈశాన్య భారత దేశంలోని రాష్ట్రాల తాలూకు సమావేశం. నన్ను అతిథి వక్తగా పిలిచారు. నేను చెన్నైలో బయలుదేరి దాదాపు నాలుగు గంటల ప్రయాణం తరువాత గౌహతి విమానాశ్రయంలో దిగేసరికి అక్కడ నాకు స్వాగతం పలికింది తిలక్ శర్మ. పూర్వ పరిచయం లేకపోయినా కలుపుగోలుతనంతో ఎవరినైనా ఆకట్టుకోగల వ్యక్తిత్వం అతడిది. చాలా విషయాల్లో లోతైన పరిజ్ఞానం ఉంది. దిబ్రుగర్ తన స్వస్థలమని మాటల్లో చెప్పాడు. నాకు ఈశాన్య భారతదేశం గురించి పెద్దగా తెలియదనే చెప్పాలి.

శర్మను చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. అరగంట క్రితం 'ఉమానంద' మందిరంలో అమిత భక్తి శ్రద్ధలతో శివతాండవ స్తోత్రం, బిల్వాష్టకం చెప్పింది ఇతడేనా అనిపిస్తుంది. అతడి ఉచ్చారణలో అస్సామీ యాస ఉన్నా, శ్లోకం స్పష్టంగా వినిపిస్తుంది. చెప్పని మాటేమి, గుళ్ళో పూజారుల కన్నా శర్మే బాగా పఠించాడని తోచింది నాకు. అయితే గుళ్ళో అంత నిష్ఠగా ఉన్న వ్యక్తి బయటికి రాగానే ఎలా మారిపోయాడో! మాటల్లో బూతును యథేచ్ఛగా కలిపేస్తున్నాడు. పైగా పొగబోతు, రోజుకు ఎన్ని తెలిచుట్టలు తగలేస్తాడో దేవుడికే ఎరుక. అంతే కాదు, మందు కామందు కూడానట. 'ఇంట్లో ఎలా వేగుతారో ఏమో సార్ ఈయనతో' అంటాడు జీవన్ జనాంతికంగా. మా బృందంలో కల్లా పిన్న వయస్కుడు అతడే. అతడి పూర్వీకులు

నేపాల్ వచ్చి షిల్లాంగ్‌లో స్థిరపడ్డారు. అదృష్టవశాత్తు అతడికి షిల్లాంగ్‌లోనే ఉద్యోగం దొరికింది.

'ఎందుకలా అరుస్తావు, లఘుశంక తీర్చుకోవడానికి వెళ్ళాడేమో' అన్నాడు రాజీవ్, శర్మను ఉద్దేశించి. అతడు ఢిల్లీలో ప్రధాన కార్యాలయంలో పనిచేస్తున్నాడు.



'వాన పడేలా ఉంది, గమనించలేదా?'

మాటల్లో పడి మేం గమనించలేదు గానీ నల్లటి మబ్బులు నింగిని కమ్మేసాయి. ఏ క్షణంలో నైనా వాన మొదలుకావచ్చు.

'మంచిదే, వానలో ఎంచక్కా పడవ ప్రయాణం చేద్దాం' అన్నాడు రాజీవ్. అతడి కళ్ళలో చిలిపిదనం మెరుస్తోంది.

'బ్రహ్మపుత్ర గురించి నీకేం తెలుసు? నిన్న గాక మొన్న జోర్హాట్ దగ్గర నలుగురు గల్లంతయ్యారు. వాన పడేలోపు అవతలిగట్టు చేరుకోవాలి? శర్మ గొంతులో ఆదుర్దా.

చలిగాలి మొదలైంది.

ఏదో తెలియని భయం వెన్నులో వణుకు పుట్టిస్తోంది.

అసలు ఐదు గంటలకే 'ఉమానంద' నుంచి బయలుదేరాలనుకొన్నాం గానీ ఆలస్యమై పోయింది. గౌహతికి అనతిదూరంలో, బ్రహ్మపుత్రా నదిలోని ఓ లంకే 'ఉమానంద'. ఈ లంకలో ఓ శివాలయం ఉందనీ, తప్పకుండా ఆ స్వామిని దర్శించుకోవాలనీ శర్మ ఉవాచ. నేనూ, రాజీవూ రేపు పొద్దున్నే విమానం ఎక్కాల్సి ఉంది. అందువల్ల షిల్లాంగ్ గానీ, కజిరంగా గానీ చూసే అవకాశం లేకపోవడంతో 'నిన్న కామాఖ్యాదేవిని దర్శించుకున్నాం, ఈరోజు శివదర్శనం చేసుకుందా లెమ్మ'నుకొన్నాం. మేం బయలుదేరినప్పుడు ఎండ కాస్తోంది. మూడు నాలుగు గంటల్లో ఎంత మార్పు!

'ఎప్పుడు బయలుదేరుతుందో, ఏమో మన పడవ' అన్నాడు జీవన్, ఆకాశం కేసి చూస్తూ.

నాకు పడవ సరంగు మీద మా చెడ్డ కోపం వచ్చింది.

గౌహతి నుంచి 'ఉమానంద' కు ప్రభుత్వపు లాంచీలో వెళ్ళచ్చు. అయితే తిరుగు ప్రయాణంలో ఉమానంద నుంచి చివరి లాంచీ సాయంత్రం అయిదు గంటలకు బయలుదేరుతుంది. అది అందుకోలేకపోతే ఇబ్బంది అవుతుందని శర్మ ఓ పడవ మాట్లాడాడు. ఇది గౌహతి నుంచి 'ఉమానంద' కు వెళ్ళి రావడానికి మా కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసుకొన్న పడవ. సరంగిలా తన ఇష్టానుసారం ప్రవర్తించడం సబబు కాదు కదా.

మేం దైవదర్శనం చేసుకొని వచ్చేసరికి, పడవ ఒడ్డుకు కట్టేయబడి ఉంది. దాపుల ఉన్న బండరాతి మీద ఓ పదేళ్ళ కుర్రాడు కూచుని ఉన్నాడు. "బాబాయ్ రెండు నిమిషాల్లో వచ్చేస్తాడు" అన్నాడు.

సరంగు వాడినలా చెప్పమని పురమాయించి ఉంటాడు. ఐదు నిముషాలు పూర్తి కావస్తున్నా అయిపు లేడు.

చినుకులు మొదలవుతుండగా వచ్చాడు సరంగు. చేతిలో ఓ సంచితో..

శర్మ అస్సామీలో అతడ్ని కేక లేస్తున్నాడు. బాగానే గడ్డి పెడుతున్నా డనిపించింది. ఇలాంటి సందర్భాల్లో మెత్తగా ఉంటే ఉపయోగం లేదు.

శర్మ అరుపుల్ని ఏ మాత్రం పట్టించుకోలేదు సరంగు. బహుశా ఇలాంటి మాటలు వినీ వినీ మొద్దుబారిపోయాడేమో.

గాలి కుదుపుకు పడవ ఇటూ అటూ ఊగుతోంది.

"సంచిలో ఏముంది?" జీవన్ ప్రశ్నించాడు సరంగును.

"తెలియదు" సరంగు జవాబు.

"అదేంటీ, నీది కాదా?"

"కాదు, సామికి ఓ దండం పెట్టుకొని వస్తుండగా ఓ వారగా పడి ఉంటే తెచ్చాను."

"అయ్యో, కొంపదీసి ఏ బాంబో ఉంటే?" జీవన్ గొంతులో భయం స్పష్టంగా తెలుస్తోంది.

"బాంబూ లేదు, పామూ కాదు" అన్నాడు స్థిరంగా సరంగు.

"అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలవ్?" తర్కం లేవనెత్తాడు శర్మ.

"దేవుడ్ని నమ్మాలి బాబూ" మళ్ళీ అదే స్థిరత్వం అతడి గొంతులో.

నిష్ఠగా మంత్రాలు వల్లించే శర్మకు దేవుడి మీద ఇంత నమ్మకం లేదా? ఎంతైనా చదువుకొన్నవాడు కదా, కలదు కలండనెడి వాడు కలడో లేడో అన్న సంశయం మనసులో ఏ మూలో ఉందేమో!

## నానీలు

- పాలపర్తి ధనరాజ్
9550593901



రోడ్డు సైడు
ఫుట్ పాత్‌లు
చిరు వ్యాపారుల
బండ్ల పార్కింగ్‌లు

చెపితే వినేవారు
ఇది గతం
చెప్పినా వినరు
ఇది ప్రస్తుతం

చౌరాస్తా
నిబంధనలు
భయం
పోలీసున్నప్పుడే

ఎవరికి వారే
యమునా తీరే
సిటీల్లో
మరీను

చేతిలో సెల్లు
చెవుల్లో తీగెలు
కుర్రకారు
పైలాపచ్చీసు

ప్లాస్టిక్కు
నూరేళ్లు వర్ధిల్లు
ఏరుకొనే వాడి
మనోగతం

ఫాస్ట్‌ఫుడ్
సెంటర్లు
సాయంకాలం
కడుపు దంపర్లు

పెట్రోలు
డీజిలు
ఎక్కేమెట్టు
దిగేమెట్టు

ఈనాటి
వధువు
వచ్చే తెచ్చే
ఇచ్చే చచ్చే

చుట్టాలు
కూడా
విలన్లే
సీరియల్ టైంలో



---

సంచిలో ఏముందో అన్న ఆందోళన మమ్మల్ని వదల్లేదు. సందుల్లో పందుల్లా జీవించే నికృష్ట మనుషులకు బతుకుతీపి ఉండకపోవచ్చు. వాళ్ళు ఎలాగోలా బతుకుతారు, మన మలా కాదే.

ఉండబట్ట లేక సరంగు నుంచి సంచిని లాక్కుని అందులో ఏముందో చూశాడు రాజీవ్. ఆశ్చర్యం! నాలుగువేల రూపాయలు, అర్థం కాని ఏదో లిపిలో కొన్ని కాగితాలూ ఉన్నాయి.

"ఇంకేం, నీ పంట పండినట్టే" అన్నాడు రాజీవ్ సరంగుతో. అతడు మౌనం వహించాడు.

"దొంగ వెధవ ముందే చూసి ఉంటాడు, చూడనట్టు మనతో నాటకాలాడాడు" అన్నాడు రాజీవ్ మాతో ఇంగ్లీషులో.

"అసలు వీడే ఏ ప్రయాణికుడి దగ్గర్నుంచో కాజేసి ఉంటాడు" అన్నాడు జీవన్.

"ఒడ్డు చేరగానే ఆఫీసులో ఇచ్చేస్తాను బాబూ, ఇంకొకరి సొమ్ము మనకెందుకు" అన్నాడు సరంగు. మేం గతుక్కు మన్నాం. వెధవకు మా మాటలు అర్థమయ్యాయా? లేక మా మాటతీరును బట్టి గ్రహించాడా?

"ఆఫీసులో ఇస్తే అసలు మనిషికి చేరుతుందని గ్యారంటీ ఏమిటి? ఆఫీసు వాళ్ళే కొట్టేయచ్చుగా" అన్నాడు తిలక్ శర్మ.

"మనుషుల్ని నమ్మాలి బాబూ" స్థిరంగా పలికాడతను.

చినుకులు వానగా మారుతున్నాయి.

మాకెవరికీ మనుషుల మీద నమ్మకం లేదా? బహుశా లేదనే అనుకొంటాను. ఇతరుల దాకా ఎందుకు, ఒక్కోసారి మమ్మల్నే మేం నమ్మం.

చదువుసందెల్లేని సరంగుకు దేవుడి మీదా, మనుషుల మీదా ఎంత నమ్మకం!

ఎందుకోగానీ 'ఇలాంటి వాళ్ళ వల్లే లోకంలో ఇంకా వానలు కురుస్తున్నాయేమో' అనుకొన్నాను. నా తలపు నాకే విచిత్రంగా తోచింది. లోలోపలే నవ్వుకున్నాను.

"దిగు దిగు, ఏమిటా పరధ్యానం" అని రాజీవ్ పెద్ద గొంతుతో చెప్పేసరికి కళ్ళు విప్పి చూద్దును కదా, నిజంగానే అవతలి గట్టు చేరుకొన్నాం.



# అణగారిన బతుకుల్లో అక్షరకిరణం మహాశ్వేతాదేవి

- బెందాళం క్రిష్ణారావు
7306434888



రవీంద్రనాథ ఠాగూర్ స్థాపించిన 'శాంతినికేతన్' లో మహాశ్వేతాదేవి చదువుకున్నారు. స్వాతంత్ర్యానంతరం మహాశ్వేతాదేవి కుటుంబం భారతదేశానికి వచ్చేసింది. ఇండియన్ పీపుల్ థియేటర్ అసోసియేషన్ వ్యవస్థాపకుల్లో ఒకరైన ప్రముఖ నాటక రచయిత, ప్రజా రంగస్థల ఉద్యంకారుడు బిజోన్ భట్టాచార్యను ఆమె వివాహం చేసుకున్నారు. కాని కొంతకాలం తర్వాత వారిద్దరి మధ్య విభే దాలు రావడం వల్ల విడిపోయారు. వీరి కుమారుడు నవారుణ్ భట్టాచార్య కూడా తర్వాతకాలంలో ప్రసిద్ధిచెందిన నవలా రచయితగా ప్రసిద్ధి పొందాడు.

ప్రజాజీవితంలో మమేకమైనవారే సమాజానికి ఉపయోగపడే సాహితీవేత్తలు కాగలరని అక్షరాలా రుజువుచేసిన మహాశ్వేతాదేవి జులై 28న సాహితీలోకం నుంచి నిష్క్రమించారు. ఆమె ఒక సాహితీవేత్తగా మాత్రమే కాదు నిజమైన ప్రజాఉద్యమకారిణి, అణగారిన జీవితాల్లో అక్షరచైతన్య కిరణంగా తన చివరిశ్వాస వరకూ నిలిచారు.

"రచయితలంతా తమ తరానికి జవాబుదారులు, తమకు తాము జవాబు చెప్పుకోవాల్సిన వాళ్లు...అంత:సాక్షి ఉన్న రచయిత పీడిత ప్రజల పక్షాన దృఢంగా నిలవాలి. అలా కాకపోతే ఆ రచయితల్ని నిర్దోషులుగా భావించే ప్రసక్తేలేదు "

"నేను అభాగ్యుల పక్షాన నిలబడి నా శాయశక్తులా కలంతో పోరాటం కొనసాగిస్తున్నాను. ఆ విధంగా నాకు నేను సంజాయిషీ చెప్పుకోవాల్సి వస్తే తలదించుకోవాల్సిన అగత్యం ఏనాడూ కలగబోదు" ఒక ఇంటర్వ్యూలో మహాశ్వేతా దేవి చెప్పిన మాటలివి.

సామ్రాజ్యవాద దోపిడీశక్తుల పీడనలో నలిగిపోతున్న సామాన్యుల ఆక్రందనలను సామూహిక చైతన్యంగా మల్చడానికి ఒక చోదక శక్తిగా చివరివరకూ నిలిచిన మహాశ్వేతాదేవి అప్పటి అవిభక్త బెంగాల్‌లోని ఢాకాలో జనవరి14, 1926లో జన్మించారు. ఆమె తండ్రి మనీష్ ఘటక్ ప్రముఖ కవి. బెంగాలీ సాహిత్యంలో పేరు పొందిన సాహితీ వేత్త. మనీష్ ఘటక్ 'యువనాశ్వ 'పేరిట కల్లోల ఉద్యమంలో భాగంగా కవిత్వం చెప్పాడు. ఆమె పినతండ్రి రిత్విక్ ఘటక్ ఫిల్మ్ మేకర్. భారతదేశంలో సమాంతర సినిమా ఉద్యమానికి ప్రాణం పోసిన వారిలో ఆయన ఒకరు. భారతీయ సినిమా గర్వించదగ్గ తొలితరం దర్శకుల్లో ఆయనొకరు. ఆమె తల్లి ధరిత్రీ దేవి మహాశ్వేతాదేవికి చిన్నతనంలోనే చెకోవ్ నీ, టాల్ స్టాయి నీ, డికెన్స్ నీ పరిచయం చేసింది.

రవీంద్రనాథ ఠాగూర్ స్థాపించిన 'శాంతినికేతన్' లో మహాశ్వేతాదేవి చదువుకున్నారు. స్వాతంత్ర్యానంతరం మహాశ్వేతాదేవి కుటుంబం భారతదేశానికి వచ్చేసింది. ఇండియన్ పీపుల్ థియేటర్ అసోసియేషన్ వ్యవస్థాపకుల్లో ఒకరైన ప్రముఖ నాటక రచయిత, ప్రజా రంగస్థల ఉద్యంకారుడు బిజోన్ భట్టాచార్యను ఆమె వివాహం చేసుకున్నారు. కాని కొంతకాలం తర్వాత వారిద్దరి మధ్య విభేదాలు రావడం వల్ల విడిపోయారు. వీరి కుమారుడు నవారుణ్ భట్టాచార్య కూడా తర్వాతకాలంలో నవలా రచయితగా ప్రసిద్ధి పొందాడు. రవీంద్రుడి సన్నిధిలో శాంతినికేతనంలో చదువుకున్న 1936-38 మధ్యకాలంలో తనని టాగోర్ సాహిత్యపరంగా తీవ్రంగా ప్రభావితం చేసారని కూడా పలుసందర్భాల్లో ఆమె చెప్పేవారు. అయితే ఆమె జీవితం ఆ కళాత్మకతకీ, ఆ కాల్పనికతకే పరిమితం కాలేదు. సామాజిక

వాస్తవికతవైపు ఆమె అడుగులు వేసారు. 1950లో కమ్యూనిస్టు అన్న అభియోగంపై ఆమెను తపాలాశాఖ ఉద్యోగం నుంచి తప్పించారు. ఆ తర్వాత 1970లో ఆమెను నక్సలైట్ అంటూ పోలీసులు వెంటాడారు. తపాలాశాఖ ఉద్యోగం నుంచి తప్పుకున్న తర్వాత కోల్‌కతలోని బిజోయ్‌ఘర్ కళాశాలలో 1964నుంచి ఆమె విద్యాబోధన చేసారు. ఈ కళాశాల సంపన్న కుటుంబాలకు చెందిన విద్యార్ధినులకు మాత్రమే పరిమితమై ఉండేది. ఈ కాలంలోనే ఆమె రచయిత్రిగాను, జర్నలిస్టుగాను మారారు. నెమ్మదిగా ఆమె ఆదివాసి, దళిత బడుగు బలహీనవర్గాల జీవితాలలోని దయనీయ పరిస్థితులపై దృష్టిసారించారు. వారి జీవితాల్లో మార్పుకోసం ప్రయత్నించడమే తన జీవితలక్ష్యంగా పెట్టుకున్నారు.

**ఆదివాసీ నాయకుడు బిర్సా ముండా జీవిత కథను అరణ్యేర్ అధికార్ పేరుతో నవలీకరించారు. ఆ నవలకు సాహిత్య అకాడమీ అవార్డు లభించింది.**

కళాశాలలో విద్యార్థినులకు ఆంగ్ల సాహిత్యాన్ని బోధించడం, గ్రామీణ భారతదేశంలోని బడుగువర్గాల జీవితాల గురించి పత్రికలకు వ్యాసాలు రాయడం చాలా కాలం కొనసాగించారు. సామాజిక కార్యక్రమాలే ఆమె సాహితీ వ్యాసంగానికి అవసరమైన ప్రేరణనిచ్చాయి. చాలామంది రచయితల్లా ఆమె నాలుగు గోడలమధ్యే ఉండిపోయి సామాజిక రచనలు చేయలేదు. ఒక జర్నలిస్టుగా మాత్రమే ఆమె తన పరిధిని ఒక గిరిగీసుకుని కూర్చోలేదు. బెంగాల్, బీహార్, ఒడిసా, ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, చత్తీస్‌ఘడ్ తదితర రాష్ట్రాల్లోని మారుమూల ఆదివాసీ గ్రామాల్లోకి వెళ్లి అక్కడి ప్రజాజీవితాన్ని ప్రత్యక్షంగా పరిశీలించారు. తాను చూసినదానిని, అవగాహన చేసుకున్నదానిని అక్షరాయుధాలుగా అందించారు. అలాగని ఆమె కేవలం సాహిత్యానికి మాత్రమే పరిమితం కాలేదు. గ్రామీణ ప్రాంతాల్లో గిరిజనులను, బడుగు బలహీనవర్గాలను సమీకరించి, వ్యవస్థీకృతంగా వారు తమ సమస్యలను పరిష్కరించుకునేలా వారిలో చైతన్యాన్ని సృజించారు. ఝాన్సీ రాణి మీద తానే స్వయంగా వివరాలు సేకరించి ఒక నవల రాసారు. "ఝాన్సీ కా రాణి" అనే పేరుతో 1956లో వచ్చిన ఆమె తొలినవల అది. అప్పటి నుంచీ చాలా వేగంగాను, చాలా ఎక్కువగాను ఆమె రాశారు. మొత్తం 20 కథా సంపుటాలు ప్రచురించారు. దాదాపు వంద నవలలు రాశారు.

నక్షల్బరీ ఉద్యమం నేపథ్యంగా ఆమె 1975 లో రాసిన 'హజార్ చౌరాసీర్ మా '(1084వ వ్యక్తికి చెందిన తల్లి) ఆమెను ఒక జాతీయ స్థాయి రచయితగా మార్చేసింది. ఆ నవలకే ఆమెకు1996 లో జ్ఞానపీఠ పురస్కారం లభించింది. ఆ ఇరవయ్యేళ్ళ మధ్యకాలంలో ఆమె అసంఖ్యాకంగా కథలు, నవలలు రాసింది. వాటిల్లో బిర్సాముండా ఇతివృత్తంగా రాసిన 'అరణ్యేర్ అధికార్' (1977, తెలుగులో 'ఎవరిదీ అడవి'), అగ్నిగర్భ(1978), 'బషాయిటుడు ', 'ఛోటీ ముండా ఏవం తార్ తీర్ '(1980), 'రుడాలి' లాంటి సుప్రసిద్ధ రచనలున్నాయి. బ్రిటీషు వారికి వ్యతిరేకంగా జరిగిన ముండా తిరుగు బాటులో నాయకత్వం వహించిన ప్రముఖ ఆదివాసీ నాయకుడు బిర్సా ముండా జీవిత కథను అరణ్యేర్ అధికార్ పేరుతో నవలీకరించారు. ఆ నవలకు సాహిత్య అకాడమీ అవార్డు లభిం చింది. ఆమె రాసిన అనేక కథలు సినిమాలుగా వచ్చాయి. గోవింద్ నిహ్లానీ తీసిన 'హజార్ చౌరాసీకీ మాం' గొప్ప సినిమాగా పేరు తెచ్చుకుంది. నక్సలైటు ఉద్యమంలో తన కొడుకు ఎందుకు చేరాడో తెలుసుకోవాలన్న ఒక తల్లి ప్రేగు బాధను ఆమె నవలగా మలిచారు. సూరంపూడి సీతారాం ఈ నవలను 'ఒకతల్లి' పేరుతో తెలుగులో అనువదించారు. 1993లో కల్పనా లాజ్మి 'రుదాలీ' నవలను సినిమాగా తెరకెక్కించారు. ఈ నవలలోని వస్తువుకూడా అసాధారణమైనది. రాజస్థాన్లో అగ్రకులాల ఇంట ఎవరైన పురుషుడు మరణిస్తే దుఃఖించడానికి, రోదించడానికి కిరాయికి వెళ్ళే మహిళ కథ ఇది. అనేక కష్టాలు, అనేక చావులను చూసి కూడా ఎన్నడూ ఏడుపన్నది తెలియని ఒక మహిళ, చివరకు ఒక సంపన్న కుటుంబంలో కిరాయికి రోదించే స్త్రీగా వెళ్ళడం, అక్కడ ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగే వార్త తెలియడం ఇందులో కథావస్తువు. ఈ కథ బడుగు స్త్రీల జీవితాలను అత్యంత ఆర్ద్రంగా మనకు తెలియజేస్తుంది. మహిళల హక్కులపై ఆమె రాసిన కథ 'చోలీకే పీఛే' సినిమాగా ఇటాలియన్ డైరెక్టర్ ఇటలోస్పయినేలీ తీశారు. ఈ సినిమా ఎన్నోభాషల్లో తర్జుమా అయ్యింది.

మహాశ్వేతాదేవి రచనలన్నీ అన్నీ బెంగాలీ భాషలో రాసినవే. కాని ఆమె రచనలు భారతీయ భాషల్లోనే కాదు, అనేక విదేశీ భాషల్లోకి కూడా అనువాద మయ్యాయి. బెంగాలీ సాహిత్యంలోనే కాదు భారత సాహిత్యం లో ఆమె తన దైన అధ్యాయాన్ని రాసుకున్నారు. ఆమె కథ ల్లోను, నవలల్లోను కనిపించే పాత్రలు వలస కూలీలు, నిమ్న కులాలు, భూమిలేని

పాలేరులు, తోడులేని నిరు పేద మహిళలు, హక్కులంటే ఎరుగని ఆదివాసీలు, ఈ అణగారిన వర్గాల పై పెత్తనం చెలాయించే దౌర్జన్యాలకు పాల్పడే పెత్తందారులు. సమాజంలో తాను చూసిందే ఆమె రాశారు. నిజ జీవితంలో తాను చూసిన కథలను సాహిత్య విలువలతో, విశ్వజనీన ప్రమాణాలతో అద్భుతమైన కథనంతో ఆమె నవలీకరించారు. స్వతంత్ర భారతదేశంలో ఆదివాసులకి బతకడానికి కూడా హక్కు లేకపోయిందనేది మహాశ్వేతాదేవి చూసి, చెప్పిన మాట. దాదాపుగా ఆమెకి సమకాలికంగా తెలుగు కళింగాంధ్ర కథకులు భూషణం వంటివారు కూడా ఆ మాటే చెప్తూ వచ్చారు. పురులియా నుంచి పాడేరుదాకా పరిస్థితులవే. కాని తాము చూసినదాన్ని ఆమెలాగా విస్తృతమైన కాన్వాసుమీద, నిష్ఠురమైన వ్యంగ్యంతో, విస్తారంగా రాయగలిగిన రచయితలు తెలుగులో లేకపోవడం కొంత బాధాకరమే. ఆమె తన రచనల్లో వేలెత్తి చూపిన అనేక సమస్యలు రాజకీయ వేదికలపై చర్చకు రాకతప్పడంలేదు.

మహాశ్వేతా దేవి పశ్చిమబెంగాల్ వామపక్ష ప్రభుత్వం భూ సంస్కరణలను మనస్ఫూర్తిగా హర్షించారు. అయితే అవి ప్రభుత్వ విధానాల వల్ల కాక అప్పటి సీనియర్ మంత్రి వినయ్ చౌదరి కృషి వల్ల జరిగాయని భావించేవారు. బెంగాల్‌లో భూమి, రెవెన్యూ శాఖ అద్భుతంగా పనిచేసిందని అప్పట్లో ఆమె మెచ్చుకున్నారు. నందిగ్రాం, సింగూరు ఘటనల తర్వాత వామపక్ష ప్రభుత్వంతో విభేదించారు. పరిశ్రమలు రావాలి కానీ అందుకు బీడు భూమిని ఉపయోగించాలని సూచించే వారు. 2011 ఎన్నికల్లో ఆమె మమతా బెనర్జీ ఇచ్చిన పరివర్తన నినాదాన్ని గట్టిగా బలపరుస్తూ వామపక్షాలకు వ్యతిరేకంగా ప్రచారంలో పాల్గొన్నారు. మమతా బెనర్జీ కూడా అనుకున్న ప్రకారం పనిచేయడం లేదని ప్రశ్నించినప్పుడు అంతా ఒక్క రాత్రిలో జరిగిపోదని వ్యాఖ్యానించే వారు.

ప్రభుత్వ కార్పొరేట్ అనుకూల ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా, పచ్చని పంట పొలాల్ని అన్నం పెట్టే రైతుల నుండి లాగేసుకుంటున్న విధానాన్ని ఆమె కడవరకు నిరసించారు. రాజ్యహింసపై ఆగ్రహాన్ని ప్రకటించారు. ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను వ్యతిరేకించారు. పశ్చిమ బెంగాల్లోని డీ నోటిఫైడ్ ఆదివాసీ ప్రజలు 'సబర్' తెగకు ఆమె అందించిన సేవల వల్ల ఆమెను 'సబర్ తెగకు తల్లి' గా భావిస్తారు. 'ఆదివాసుల అమ్మ' గా గౌరవిస్తారు. ఆదివాసీ పత్రిక 'బర్తికా' కు సంపాదకురాలిగా ఆమె 1980 నుంచి సేవలందించారు.

తెలుగునేలతో ముఖ్యంగా కళింగాంధ్ర ప్రాంతంతో మహాశ్వేతాదేవికి అనుబంధం ఉంది. 1997 మే7న జనసాహితి సంస్థ ఆహ్వానంపై విశాఖపట్నం వచ్చారు. అల్లూరి సీతారామరాజు వర్ధంతి సందర్భంగా వేలాదిమంది ఆదివాసీల ఊరేగింపులోనూ, బహిరంగసభలోనూ ఆమె పాల్గొన్నారు. తర్వాత రోజు సాహితీ సదస్సుల్లో పాల్గొన్నారు. ఆ మర్నాడు విజయనగరం జిల్లా దుగ్గేరు ఏజెన్సీలో ఆదివాసీల మహాసభలో 'మన్యంవీరుని పోరుదారి' అనే పుస్తకాన్ని ఆవిష్కరించారు.

2006లో జర్మనీలోని ఫ్రాంక్ ఫర్ట్ బుక్ ఫెయిర్‌లో భారతదేశం పాలుపంచుకున్న సందర్భంలో ప్రతినిధిగా వెళ్లిన మహాశ్వేతాదేవి చేసిన ప్రారంభ ఉపన్యాసం అందరినీ కదిలించింది. శ్రోతలు కన్నీళ్ళు పెట్టుకునేలా ఆమె ప్రసంగించారు. రాజ్ కపూర్ సినిమాలోని పాట, మేరా జూతా హై జపానీ (బూట్లు జపానువి), పట్లూన్ ఇంగ్లీస్తానీ (ప్యాంటు ఇంగ్లీషువారిది), లాల్ టోపీ రూసీ (టోపీ రష్యాది), ఫిర్ భీ దిల్ హై హిందూస్తానీ (అయినా మనసు భారతీయం) అనే పాటతో ఆమె ప్రారంభించిన ఉపన్యాసం అందరినీ కన్నీళ్ళ పర్యంతం చేసింది.

అనేక విశిష్టమైన పురస్కారాలు ఆమెను వెతుక్కుంటూ వచ్చాయి. 1979లో సాహిత్య అకాడమీ పురస్కారం, 1986లో పద్మశ్రీ, 1996లో జ్ఞానపీఠ్, 1997లో రామన్ మెగసెసె, 2006లో పద్మవిభూషణ్ వంటి పురస్కారాలు అమెకు లభించాయి. గిరిజన, ఆదివాసీల సంక్షేమం కోసం ఆమె అనేక సంస్థలను కూడా స్థాపించారు. ఆమె కుమారుడు నాబారుణ్ కూడా సాహిత్య అకాడమీ అవార్డు పొందిన కవి, నవలా రచయిత. ఇతడు 2014లో మరణించాడు.

కలకత్తాలో సుదీర్ఘ కాలం నివసించిన మహాశ్వేతాదేవి భారతదేశం గర్వించ దగ్గ మహిళగా, రచయిత్రిగా, సమాజ సేవకురాలిగా ప్రపంచవ్యాప్త గుర్తింపు పొందారు. తొంభయి సంవత్సరాలకు పైబడిన వయసులో ఆమె తన కార్యకలాపాల్లో అలసటను దరికి రానీయలేదు. మహాశ్వేతాదేవి మరణం సాహితీలోకంలో ఒక లోటును ఏర్పరిచింది. ఆమె అమరత్వం నేడు ఆదివాసుల, దళితుల, మహిళలపై అమలవుతున్న వ్యవస్థీకృత హింస, ఆధిపత్య హిందూ మతోన్మాద హింస, సామ్రాజ్యవాద నిరంకుశ దళారీ దోపిడీ విధానాలు అమలుచేస్తున్న రాజ్యం ప్రజలపై చేసే యుద్ధం వీటన్నిటినీ ప్రశ్నించమని మార్గదర్శకం చేస్తోంది.

❋

## చెట్టును చంపే విధంబెట్టిదనిన...!

ఆంగ్ల మూలం : జీవ్ పటేల్
స్వేచ్ఛానువాదం : అలజంగి మురళీధరరావు
9440335461

మట్టిసారాన్ని ఆసరా చేసుకుంటూ
మెల్లగా బయటకు తలఎత్తి
భూమిపై పొరపై కాలం వెళ్లదీస్తుంది చెట్టు
ఏళ్ళ తరబడి ఎండ, గాలి, నీరు మింగుతూ
కుష్ఠురోగి చర్మంలా ఉండే
మచ్చ మచ్చల తన మేను నుండి
లేలేత చివుళ్ళను తొడుగుతూ
పెరిగి పెద్దగౌతుంది చెట్టు
చెట్టును వేసెయ్యడం
తేలిక అనుకుంటున్నారా
కానే కాదు
అది ఎంత ప్రయాసో!!
ఏదో ఒక సాదా కత్తితో పొడిస్తే పనైపోదు
అలా అని
గొడ్డలి పుచ్చుకుని నాలుగు దెబ్బలేసి
నరికినా అంతే!!
ఎంతగా యాతన పడినా వృధానే!
పచ్చిగాయంతో స్రవిస్తున్న బెరడు
వింతగా
తనకు తానే స్వస్థపరచుకొంటుంది
దెబ్బల స్థానంలో చుట్ట చుట్టినట్టుండే



లేత రెమ్మలు
ప్రత్యక్షమౌతుంటాయి
అనతికాలంలో అవి
కళ్ళముందే చిరుకొమ్మలై ఎదిగి
ఎలా వ్యాపిస్తాయో!!
లాభం లేదు
దీన్ని చంపాలంటే ఒక్కటే మార్గం!
కూకటివేళ్ళతో పెకిలించాలి
పడుగుతాడు కట్టి
లాగి బిగించి
మరీ పెకిలించాలి!
హప్పటికి !
అది ఫెళ ఫెళా శబ్దం చేస్తూ
భూగర్భం నుంచి పూర్తిగా విడిపోయి
నేల కూలుతుంది
ఏళ్ళ తరబడి మట్టిలో దాగివున్న
నున్నని తెల్లని పచ్చి మొదలుతో సహా!
ఇక మిగిలింది
దానిని
ఎర్రని ఎండలో ఎండబెట్టడం
కొమ్మల్ని రెమ్మల్ని విరిచి పారేయడం
గోధుమ వర్ణంలోకి మార్చడం
అటు ఇటూ తిప్పుతూ వాడ బెట్టడం
మొండెం తేలేటట్టుగా చెయ్యడం
అంతే!!
పని పూర్తి అయినట్టే !!!



---

## గవాక్షం

- మెరాజ్ ఫాతిమా
9000173860



జనన, మరణాల మధ్య మనిషి తనదారి వెతుకుతాడు,
తన చూపుకనుగుణంగా గవాక్షం అమర్చుకుంటాడు,
తత్వ పునాదుల వైపు దృష్టి సారిస్తూనే..
మార్మిక కామితాన్ని ఆహ్వానిస్తాడు.
నీకు తెలుసా....?
గర్భంలోకి గాలమేసి ...
అమ్మతనాన్ని అమ్మకానికి పెట్టే కాలమిది,
ఏం లాభం,
నిన్ను నీవే తొలుస్తూ...,
నిన్ను నువ్వే మలచుకోలేని వులి నీవు.
ఓ మనిషీ....,
నీ జన్మకి ఓ అమ్మ. కావాలి,
నీ దేహానికి ఊపిరి కావాలి,
అరె.... ఓసారటు చూడు,
దేహమిచ్చిన దేవళం బీటలుబారి,
మౌనాన్నీ, దైన్యాన్నీ మోస్తూ....
దిక్కులు చూస్తుంది,
నీ అహంతొ గెలుచుకున్న. శవాలన్నీ...,
శరీరాంగాలతో సంచరిస్తున్నాయి....,
ఓయి అమాయకుడా....,
ఆమె పరాజిత కాదు, నీ ప్రాణదాత.
క్షణం, క్షణం .....నీ కణాలను పేర్చిన..."మా "నవ నిర్మాత



# అంపశయ్య నవీన్ కథా సాహిత్యం

- బచ్చలి రజితకుమారి
9491821807




***వీరు ప్రసిద్ధ నవలాకారుడిగా అందరికి సుపరిచితుడు. కానీ, వీరు గొప్ప కథా రచయిత కూడా. ఇప్పటివరకు 86కు పైగా కథలను రచించి వీటిని 6 సంపుటాలుగా ముద్రించారు. వీటిలో "బంధితులు, అస్మదీయులు, తస్మదీయులు, ఫ్రమ్ అనురాధ విత్‌లవ్" వంటివి కొన్ని.***

తెలుగు సాహిత్యంలో "ఓరుగల్లు" (వరంగల్) ప్రాంతానికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. ఈ ప్రాంతం సాహిత్యానికి, కళలకు, ఉద్యమాలకు నిలయం. ఎందరో రాజులు వరంగల్‌ను రాజధానిగా చేసుకొని సువిశాల సామ్రాజ్యాన్ని ఏర్పర్చుకొని పాలించారు. తెలుగు ప్రజల నిత్యపారాయణ గ్రంథాలైన "భాగవతం", "బసవపురాణం" వంటి రచనలు పుట్టింది ఇక్కడే. క్రీ.శ. 20వ శతాబ్దంలో తెలుగు సాహిత్యంలో అనేక నూతన ప్రక్రియలు వెలసినవి. అలా వెలసిన ప్రక్రియలలో "కథాప్రక్రియ" కూడా ఒకటి. వరంగల్ జిల్లాలో 1924లో కంభంపాటి అప్పన్నశాస్త్రి రచించిన "వింతలు" అనే కథను మొదటి కథగా చెప్పవచ్చును.

1970కి పూర్వం ఉన్న వరంగల్ కథా రచయితలు ఆనాటి "నిజాం ప్రభువుల అస్తవ్యస్త పరిపాలనను, రజాకార్ల దురాగతాలను, ప్రజల తిరుగుబాటును, రైతు ఉద్యమాలు మొదలగు సంఘటనలను చూసి చలించిపోయిన హృదయాలతో నిజాంను వ్యతిరేకిస్తూ, ప్రజలను ఉత్సాహపరిచి, చైతన్యవంతులను చేయడానికి అనేక కథలను, కథాసంకలనాలను వెలువరించి వరంగల్ జిల్లా కథా సాహిత్యకృషికి పూనుకున్నారు. అలా ఆనాటి నుండి నేటి వరకు కలం కదిలిస్తూ, ఎన్నో కథలు, నవలలు రచించి, ప్రముఖ నవలాకారుడిలా అందరి హృదయాలను చూరగొని, కేంద్రసాహిత్య అవార్డు గ్రహీతగా వరంగల్ కీర్తిని మరింతగా పెంచిన రచయిత "అంపశయ్య నవీన్".

వీరు ప్రసిద్ధ నవలాకారుడిగా అందరికి సుపరిచితుడు. కానీ, వీరు గొప్ప కథా రచయిత కూడా. ఇప్పటివరకు 86కు పైగా కథలను రచించి వీటిని 6 సంపుటాలుగా ముద్రించారు. వీటిలో "బంధితులు, అస్మదీయులు, తస్మదీయులు, ఫ్రమ్ అనురాధ విత్‌లవ్" వంటివి కొన్ని.

పి.యు.సి. చదువుకునేటప్పటి నుండే తన చుట్టు ఉన్న పరిస్థితులకు చలించిపోయి వాటిని కథలుగా మలచుకున్న వీరు 24-12-1941లో నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలుకా మద్దిరాల గ్రామంలో దొంగరి నారాయణ, పిచ్చమ్మ దంపతులకు జన్మించారు. ప్రాథమిక విద్యాభ్యాసం స్వగ్రామం వావిలాలతో పాటు కొడకడ్ల, కొరవి, తిరుమలగిరిల్లో పూర్తిచేశారు. 1957లో వరంగల్‌లోని ఏ.వి.వి. హైస్కూల్‌లో చదివి హెచ్.ఎస్సీ ఉత్తీర్ణులయ్యారు. 1958లో ఆర్ట్స్ & సైన్స్ కాలేజీలో పి.యు.సి.లో చేరిన తర్వాత బి.ఏ. చదివి, ఉస్మానియా విశ్వవిద్యాలయం హైద్రాబాద్‌లో ఎం.ఏ. (అర్థశాస్త్రం)లో పట్టాపొందారు. 1962లో మేనమామ కూతురు అనసూయ గారిని వివాహమాడారు. 1964 నవంబర్‌లో అర్థశాస్త్రోపన్యాసకునిగా చేరినప్పటి నుండి అనేక పదోన్నతులు పొంది 1996 జులై 31న ప్రభుత్వ పింగళి మహిళా కళాశాల నుండి పదవి విరమణ పొందారు. విరమణ అన్నది తన వయస్సుకే కానీ, మనసుకు కాదన్నట్లు తమ ఇప్పటికి తన రచనలు కొనసాగిస్తూ సాహిత్య సేవ చేస్తున్నారు.

ఆర్ట్స్ & సైన్స్ కాలేజీలో పి.యు.సి. చదువుతున్నప్పుడే 1959లోనే తన మొట్టమొదటి కథ "చితికిన జీవితం"ను రాశారు. కళాశాలలో ప్రతి సంవత్సరం తన నిజ జీవితంలో జరిగిన ఒక యదార్ధ సంఘటన కావడం విశేషం. 1959 నుండి 1970 వరకు వీరు రాసిన కథలు "చితికిన జీవితం", "పేదవాడి పెళ్ళాం", "కసి", "కుళ్ళు", "వేట", "నిప్పురవ్వలు", "అధోలోకం", "సుధ", "తీరిన కోరిక".

**చిన్న చిన్న పాత్రల మానసిక స్థితిని పట్టివ్వగల రచనా నైపుణ్యం ఉంది. భాషను పొదుపుగా వాడుకొని భావాన్ని పదునుగా చెప్పే లక్షణం ఉంది.**

"సుధ" (1970) అనే కథలో ఒకే కుటుంబంలో ఉన్న అన్నదమ్ములిద్దరు వేరువేరు రాజకీయ పార్టీల్లో చేరడం వల్ల ఆ కుటుంబం విచ్ఛిన్నమవ్వడమే కాకుండా, వారు అల్లారుముద్దుగా చూసుకున్న చెల్లెలు "సుధ"తో పాటు కన్నతండ్రిని పొట్టనబెట్టుకున్నారు. రాజకీయాల్లో చేరి మంచి చెడు విచక్షణా జ్ఞానాన్ని సైతం మరిచిపోతున్న వ్యక్తులను కనువిప్పు కలిగేలా చేసింది ఈ కథ. ఈ కథకు మూలం ఆనాడు నవీన్‌గారి ఊరిలో ఉన్న రాజకీయ పార్టీల వల్ల ప్రజలు అనుభవించిన చేదు అనుభవాల నుండి వచ్చినవే.

1969లో రాసిన "నిప్పురవ్వలు" కథలో తండ్రి తనకు పెళ్ళి చేయలేదని భావించిన సరోజ తమింట్లో జీతగాడైన పిచ్చివాడితో సంబంధం పెట్టుకొని, అవసరాలు తీర్చుకొనే సరోజ పిచ్చివాడి ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేని ఈ సంబంధం, చివరికి ఆమె తండ్రితో దెబ్బలు తిని ప్రాణాలు పోయే స్థితి కన్పిస్తుంది.

"కసి" (1969)లో ఒక తాగుబోతు వ్యక్తివల్ల ఈ కుటుంబం పడే నరకయాతనను చూసిన పెద్దకొడుకు తండ్రిని చంపాలనుకుంటాడు. కానీ, ఆ తండ్రే తన తప్పును తెలుసుకొని ఆత్మహత్యకు పాల్పడటం చూసి కన్నీరు కార్చే కొడుకు కనబడతాడు.

"పేదవాడి పెళ్ళాం" (1969) కథలో ధనవంతుడు ఒక పేదవాడి భార్యను కోరుకోవటం, ఆమెను లోబర్చుకోవటం వల్ల ఆ కుటుంబం అంతమవ్వడాన్ని గమనించవచ్చు.

1967లో రాసిన 'తీరినకోరిక' కథ పెళ్ళైన వారు తప్పక చదవాల్సిన కథ ఇందులో భర్త రాజారావు రొమాంటిక్‌గా ఉంటే, భార్య సాధారణ గృహిణిగా ఉండటం అతనికి ఏ మాత్రం నచ్చదు. భార్య మల్లెపూలు తీసుకురమ్మని చెప్పడానికి బదులు, బొగ్గుబస్తా తెమ్మని చెప్పడం విని తట్టుకోలేక పోయాడు. భార్యపై తెలియని అనుమానం పెంచుకొని ఆమెను పరిపరివిధాల హింసించి, చివరికి తన తప్పును తెలుసుకొని పశ్చాత్తాపపడి ఆమెను చేరదీస్తాడు.

1965లో వచ్చిన "అధోలోకం"లో ఒక వ్యక్తిలో ఉన్న రెండు మనసులు తన ప్రమేయం లేకుండా తీసుకునే నిర్ణయాలు ఎలా ఉంటాయో చెపుతుంది. చదువుకునే విద్యార్థి మనసు మంచి కంటే చెడునే తొందరగా గ్రహించి, ఎప్పుడెప్పుడు ఆ విషయాన్ని బయట పెడుదామా అని చూసే అతని ప్రవర్తనను హెచ్చరించడం గమనించవచ్చు.

ఇలా నవీన్‌గారు రాసిన ప్రతి కథలో కూడా తనకంటూ ఒక ప్రత్యేకతను చాటి చెప్పేదిగా ఉంది. తను రాసే కథలన్నీ నిత్యం మనచుట్టూ ఉన్న సమాజంలో జరిగే పరిస్థితులకు నిలువుటద్దాలుగా నిలిచాయి. వీరి కథల్లో పాత్రలు వివిధ రంగాలకు, వివిధ స్థాయిలకు చెందిన వ్యక్తులే. విద్యార్థులు, లెక్చరర్లు, శ్రమజీవులు, ఉద్యోగులు, ప్యూన్లు, గుమాస్తాలు, జమీందార్లు, అనుమానపు భర్తలు, మధ్య తరగతి సాధారణ గృహిణులు, రకరకాల పాత్రలు అత్యంత సహజంగా మనల్ని ఆకర్షిస్తాయి. వీరి కథల్లో వైవిధ్యం ఉంది. జీవితం పట్ల పరిశీలనా దృష్టి ఉంది. వివిధ మానసిక పార్శ్వాలను చిత్రించగల నేర్పరితనం ఉంది. కథా శీర్షికల్లో స్పష్టమైన ఔచిత్యముంది. చిన్న చిన్న పాత్రల మానసిక స్థితిని పట్టివ్వగల రచనా నైపుణ్యం ఉంది. భాషను పొదుపుగా వాడుకొని భావాన్ని పదునుగా చెప్పే లక్షణం ఉంది.

ఈ కథలన్నింటిలో ఒక పాత్ర సన్నివేశం, సందర్భం మరోపాత్ర పై ఎటువంటి ప్రభావాన్ని చూపుతుందో, ఆ ప్రభావాన్ని బట్టి అంతరంగికమైన ప్రతిస్పందన ఎలా ఉంటుందో స్పష్టంగా కనబడుతుంది.

చైతన్య స్రవంతి పద్ధతి ద్వారా జీవితంలో ఒక అసంబద్ధతను, అరాచక స్థితిని చెప్పడం ద్వారా ఒక బలమైన సాంఘిక ప్రయోజనాన్ని సాధించే లక్ష్యంతో వీరి కథలు ముందుకు సాగుతున్నాయని చెప్పడానికి పాఠకులు వీరి కథలను చదవడమే ఒక సాక్ష్యం.

❋

# వల

- చందనపల్లి గోపాలరావు
9440104546



సాయంకాలం ఈదురుగాలి కొదుతోంది. చెట్టు కొమ్మకు వేళాడుతున్న పక్షి గూడు అటూ ఇటూ ఊగుతోంది. గూడులోని పక్షి పిల్లల అరుపులతో విశాలంగా కొమ్మలతో విస్తరించిన వేపచెట్టు ఆ వాతావరణానికి కల్లోల పడుతున్నట్టుగా ఉంది.

పట్టణ శివార్లో కట్టుకున్న ఇంటి లోపల నుండి తలుపుతీసి బయటకు వచ్చింది సీతాలమ్మ. గాలికి తలుపులు కొట్టుకోవడంతో లోపలికి వెళ్ళి గడియ వేసుకుంది. ఇంతకు ముందు ఇలా ఎన్నిసార్లు చేసిందో. కొత్తగా వెలిసిన కాలనీలో ఆడుకుంటున్న పిల్లాడు ఎవరో విసిరేసిన అగ్గిపెట్టెలు లాగా అక్కడ ఒకటి ఇక్కడ ఒకటి ఇళ్లు. తన లాగే ఆ ఇళ్ళల్లో కూడా ఒక ముసల్దో, ముసలాడో. తెల్లారి గూడును వదలి బయటకి పోయిన పక్షులు ఏ సాయంత్రానికో, రాత్రికో చేరినట్లు ఉద్యోగాల కోసం వెళ్ళిన వాళ్ళు ఇళ్ళకు చేరేసరికి చీకటి పడుతుంది. అంతవరకూ వయసు మళ్ళిన జీవితాలకు జైళ్ళో ఉన్నట్లే ఉంటుంది.

'ఊర్లో ఐతే సల్లందలేలప్పుదు పొలానికి అందరూ ఎటోలటు ఎల్లిపోయినా ఆవక్కా ఈవక్కా అలికిరి ఉండీది. ఇరుగూపొరుగూ ఇల్లు. ఇంటి మొగోలు నాలుగు రోజులు అటూఇటూ ఎల్లినా ఏ బయ్యిం ఉండీది కాదు. మునిలోలుమందరము వొక్క దగ్గిరికి సేరి మాట్లాడుకుండోలిమి. ఇక్కడ మాట్లాడుదుమంతే వొక్కలూ కనపడరు. ఎవరి ఇళ్ళల్లో ఆలు గడెట్టుకోని తొంగోడమే. ఎంతకని టీ.వి సూత్తాము. ముండ్రాల టీ.వి. కళ్లు పోతన్నాయి.' ఆలోచనల్లోనే విసుక్కుంది సీతాలమ్మ.

ఒకసారి తలుపు తీసి వీధి రోడ్డువైపు చూసింది. గాలి వీస్తూనే ఉంది. ఏమీ తోచక తలుపు వేసుకొని మళ్లీ ఆలోచనల్లో పడింది.

'వొకసారి పోనీ సుద్దుం కదా అని పక్కింటికెల్లి మాటలు కలుపుదుం అనుకున్నానా? ఐతేటి ఆయమ్మ తలుపు

తియ్యకుండానే కిటికీలోనుండే మాట్లాడింది. ఏటి ఆల సంసారం ఎత్తికెలిపోతాను. నాకు సి[రెత్తుకొచ్చింది. ఆలతోని నాకెందుకని అటుకాసే ఎల్దం మానీసాను. ఎంతకని అత్తాకోడళ్లము ఇంటిలోన వొకరి మొకాలు వొకరం సూసుకోని కూకుంతాము. మా బావు ఉజ్జోగానికి ఎలిపోయింతరువాత ఇంతోటి ఇంటిలోన మా యిద్దరమే. మనవళ్లు ఇద్దరున్నారంతే ఆలు యింతోలు ఐనకానించి



ఆస్టల్లోనే ఆల సదువులు. ముండ్రాల సదువులు ఆలే సదివేత్తండ్రా? మా కాలంలోని పిల్లలు సదవనేదా? ఇంటి దగ్గిరే ఉండి గవరమెంటు బడిలోన మా బావు సదివేడు. ఉజ్జోగం రానేదా? అంతే మా కోడలు ఇంతెత్తు లేస్తాది.

"ఇక్కడ సదవ బట్టే మీ బావుకి ఇంత పెద్ద ఉజ్జోగం వొచ్చీసింది. నా కొడుకులూ ఇలాపింటి ఉజ్జోగాలే సెయ్యాలా?" అని నాతోటి తగువుకొస్తాది.

'సచ్చిన కోడి ముచ్చికలు పెట్టినట్టు' నాకెందుకని నోరు మూసుకొని ఉంతన్ను. ఆలు సిన్నపిల్లలు. వొక ముద్దూముచ్చటా వొద్దా? ఆటా పాటా అక్కర్నేదా? సిన్నా పెద్దా అంతరం తెలియొద్దా? అది తానా అంతే మా బావు తందానా అంతాడు.' గాలికి తలుపులు ధబీమని శబ్దం చేసే సరికి ఒక్కసారి తుళ్లిపడి ఆలోచనల్లోంచి బయట పడింది సీతాలమ్మ. తలుపు గడియ తీసి మరొక్కసారి బయటకు వచ్చి చూసింది.

గూటిలోని పక్షి పిల్లలు తల్లి పక్షి రాకకోసం భయంభయంతో ఎదురు చూస్తున్నట్లు అరుస్తున్నాయి.

'ఉదయమనగా ఎల్లారు కొడుకూ కోడలూ యింకా రాలేదు. సీకటి పడతంది. సుట్టుపక్కల ఎక్కడా అలికిరి లేదు. పగలంతా ఎలాగోలాగ గడిసిపోద్ది. కానీ సీకటి పడిందంటే సాలు బయ్యిమే. ఈ మాత్రం దానికి ఇక్కడెందుకు ఇల్లు కట్టుకోడమో? అప్పుడికీ సెప్పాను. ఇంతే కదా! ఉజ్జోగం వొచ్చిన మొదట్లో పైసాపైసా కూడబెట్టి సీటీలు కట్టి పట్నం దగ్గిర వొక సోటు కొన్తన్ను అన్నాడు మా బావు. సూత్తే అది అడివిలాగుంది. అంత డబ్బు పోస్సి అక్కడెందుకురా అని మొత్తుకున్నాను.

'నీకు తెలీదే, అక్కడ ఎంత రేటనుకున్నావు. ఇప్పుడు కొనకపోతే తరువాత దొరకదు. రేటు పెరిగిపోతాది' అని సెప్పి వొక సోటు సంపాదించాడు. అప్పుడే నా గుండిల రాయి పడిపోయింది, ఊరొగ్గీసి ఎలిపోతామేట్రా దేవుడా అని.

'ఇప్పుడే మనం ఇల్లు కట్టీగలవేంటే. సోటుకొనడానికే అప్పు సెయ్యాల్సి వచ్చింది. సోటుంతే పిల్లల సదువులికి పనికొస్తాది. అప్పుడు అమ్ముకోవచ్చు' అని నచ్చజెప్పాడు. పిచ్చిదాన్ని నమ్మీసాను. కుటుంబమంతా వొక్కడి జీతంతోనే బతకాలి. ఇంకెక్కడ సంపాదించి ఇల్లు కడతాడ్లే అనుకున్నాను. కానీ ఆల నాయిన బతికున్నప్పుడు ఎవసాయం సెయ్యిడానికి బేంకీలోన అప్పు సేసినట్టుగ, ఈడూ బేంకీలోన అప్పు సేసి ఇంత ఇల్లు కట్టించీసాడు. ఈడి జీవితమంతా అప్పు తీర్సడానికే సరిపోద్ది గావాల?

ఊరిలోన ఆ పెంకుటిల్లు అలాగే అనాద లాగా ఉండిపోయింది. అద్దికిచ్చిద్దుమంతే అసలు ఊళ్లళ్ళ ఎవులుంతండ్రు? అందరూ పట్నాలకే ఎగబడతన్నారు కదా. ఊరెల్తే ఎవులింటికెల్లి ఉంతాము. అందుకని దాన్ని అలాగే వొదిలీసాము. నేనున్నంత వరకే ఆ ఇల్లు, జ్ఞాపకాలూ. ఆ తరవాత అది ఎవులిక్కావాల? ఆ ఇంటిని పట్టించుకుంతారా పిల్లలు. అయినా యింకెన్నాలు బతికియ్యాల? ముసిలితనములోన ఎవులి కోసం బతకాల? దేనికోసం బతకాల? సిన్నప్పుడివో, వొయిసులోనివో జ్ఞాపకాలే మరికొంత కాలం బతికించుతాయి కదా!

కొత్తగా పెళ్ళై వొచ్చినప్పుడు మా పాత పెంకుటింటిలోన ఈది గుమ్మం తలుపేస్సి" నీ మొగుడు పేరు సెప్పు "అని అడిగినప్పుడు ఆ పేరు సెప్పలేక సిగ్గుపడిపోనాను. తొలేత కుడికాలు పెట్టి కొత్త కాపురానికి వొచ్చింది ఆ ఇంటికే.

అత్తసేత మాటలు పడీ, మామకి సేవలు సేసి, ఆడపడుచుల అలకలు తీర్సి, కుటుంబాన్ని నెట్టుకొచ్చిందీ అక్కడే. పిల్లల్ని కనీ, పెంచీ పెద్ద సేసిందీ అక్కడే. పాత పెంకుటిల్లు అని ఇప్పుడోలికి నీరస. కానీ ఆ ఇంటిలోని ఏ మూలకెల్లినా పెతీ వస్తువు నాకోసం ఆశగా ఎదురు సూసేవే. నెలకోసారి ఎల్లి ఆటిని పలకరించి వొస్తేనేగాని ఇక్కడ ఆ నెలరోజులూ ఆ జ్ఞాపకాలతోనే బతగ్గలుగుతున్నాను.

మా అత్త సెబుతుండీది ఆలు మొదాట పాత ఊర్లో

ఉన్నప్పుడు మెట్టమీద ఉండోలట. అక్కడ అన్నీ ఇరుకిరుకు ఈదులు, చిన్న ఇళ్లేనట. ఇసాలంగా కట్టుకుందుమని మెట్ట కిందికి వొచ్చీసారట. అక్కడ ఇసాలంగా ఈదులు, పెద్ద ఇళ్లు కట్టుకున్నా ఎప్పుడూ మా అత్తకి పాత ఊరు మీదే మనసుండీదట. అప్పుడు మా అత్త సెప్పితే అర్ధమైయ్యాది కాదు. ఇప్పుడు మా బావుకీ అర్థం కాదు. అందుకే ఆడు ఎప్పుడూ అంతాడు " ఇక్కడ ఇంటికి ఏటి తక్కువని. పెద్దది, చలువరాతి గచ్చులు. గోడలకు రకరకాల రంగులు, ఖరీదైన తలుపులు, కిటికీలు. పూతిక పుల్ల తీసి ఇక్కడిది అక్కడ పెట్టక్కరలేదు. ఆ ఇంటి దగ్గరైతే ఏటికీ ఇంటికీ నీలు మొయ్యిడానికే సరిపోయాది. మరి ఇప్పుడో? గది గదికి మీట నొక్కితే నీరుకి నోరు పట్టియ్యొచ్చు." అని అంతాడు. కానీ ఎన్ని బిందిలు మోస్తే ఏటి పోయింది. నీలాటి రేవులోన అమ్మలక్కలతోటి "అవును వొదినా! ఏటి సెల్లిలా!" అని వొరసలతోటి ఆ కవురు ఈ కవురూ సెప్పుకుంతే ఎంత దీనిగుండీది.



'అక్కడికెల్లి ఆ సీపురు పట్టుకొని తుడుస్తానా? అది అంతాది, నాయిరాలమ్మా! ఇదిగో నువ్వొచ్చి తుడిసిందాకా యీ మూలే కూకోని ఉన్నాను. పనీ పాటా లేకపోతే ఇసుగులాగుంతాది. కాలూ సేతులూ ఇరిసి కట్టీసినట్టుగుంతాది' అని.

ఏటిగట్టు దగ్గిరికెల్లి నిలబడతానా? ఏరు పలకరిస్తాది. ఏటిలోని నీరు తీసి వొంటిమీద పోసుకుంతానా, వొల్లంతా ప్రేమగా తడివినట్టుగుంతాది.

ఆ పక్కింటమ్మ ఈ పక్కింటమ్మ వొచ్చి పిలుస్తారు. ఏటమ్మా ఇంటిలోనుండి ఎంతకీ రావు. బంగారం గట్టా దాస్సావేటి? అని ఇగటమాడతారు. ఇంటిలో ఉన్న అన్ని సరుకులను వొకసారి పలకరించి ఆటితోటి కష్టం సుకం మాట్లాడి ఆటిని వొదిలీసి వొచ్చీసరికి ఎంత కష్టంగుంతాదో. ఐతేటి? ఎప్పుడూ నూతిలోని కప్పల్లాగ అక్కడే బతికేస్తామా? మా తరము ఇలాగైపోయింది. నేనొచ్చి వారం పదిరోజులు ఉండి ఎలిపోతాను. కానీ ఇప్పుడోలు ఎలాగ ఉండగల్రు. పోస్లే కొడుకు టౌన్ల ఇల్లు కట్టాడు.

నాకేదైనా ఐతే డాక్టరు దగ్గిరికి తీసికెల్లి మందూమాకూ పొయ్యిడానికి అవుతాది. ఎటు ఎల్లి రాడానికైనా ఆటోలు, బస్సులూ దొరుకుతాయి. మా తరానికి అవి ఎలాగూ లేవు. ఈ తరమైనా అనుబగించనీ. నాకు ఇక్కడ సుకంగుంది. మనిసికి కావల్సిందేటి? సుకంగ బతకడమే కదా. కాలం కడెల్ల వొకలాగే ఉండిపోద్దా? కాలంతోపాటు మారకపోతే ఎలాగొద్ది? అని సరిపెట్టుకున్నాను. ఐతే వొకటే నా బయ్యిం. ఈ పట్నం నా కొడుకుని ఏటి సేసెద్దో అని. ఇప్పుడు పట్నం సాలిగూడులాగ ఐపోయింది. అందలగాని కొడుకు పడిపోతాడేటో అని బయ్యిం. '

వీధిచివర అల్లంత దూరంలో ఎవరో నడుచుకుంటూ వస్తున్నట్లు కనిపించారు సీతాలమ్మకు. ఆ వచ్చిన వారు ఎవరో అని ఆమెకు పోలిక దొరకలేదు. అక్కడ ఉన్న రెండు మూడు ఇళ్ళల్లోని వాళ్ళను పోల్చగలదు. కానీ పలచబడిన వెలుతురు లోనుండి చీకటి చిక్కబడడంతో ఆ వచ్చింది ఎవరో అని అనుమానంగా చూసింది.

కొడుకు కోడలు ఇంకా రాలేదు. చుట్టూ చూస్తే ఇళ్లల్లో అందరూ తలుపులేసుకోని ఉన్నారు. తను కూడా లోపలికి వెళ్ళి తలుపు వేసుకుంది. సీతాలమ్మకు నాలుగు రోజుల క్రితం జరిగిన సంఘటన గుర్తుకు వచ్చి భయం వేసింది.

'మా బావు సెప్పుతుంతే అలాగ నిచ్చరపోయి ఇన్నాను. ఆయమ్మ గాబట్టి బతికింది గానీ, నానైతే నిలబడిన పాటుగ సచ్చిపోదును. మా బావు ఆల స్నేహితుడు ఎక్కడో ఉజ్జోగం. ఆలమ్మ వొక్కదాయే ఇక్కడ లంకంత కొంపలోన ఉందట. ఆవిడకి వొంట పెంట సెయ్యిడానికి, ఇంటిని సూసుకోడానికి వొక పనిమనిసిని పెట్టారట. ఆ పనిమనిసి తెల్లారొచ్చి రాత్రి వరకు ఉండి ఎల్తాదట. మొన్నొక రోజు రాత్రి ఆ పనిమనిసి ఆల ఆయన వొచ్చి తలుపు కొట్టి " అమ్మా! మా ఆవిడ ఇంటికి రాలేదు. ఇక్కడే ఉందేటి?" అని అడిగాడట. ఈయమ్మ తలుపు తీసి " నీ ఇల్లాలు ఎల్లిపోయి చాలాసేపు ఐయ్యింది" అని సెప్పిందట.

ఇంటిలోన డబ్బు, బంగారం ఉంతాయని ఆశపడిపోనాడో ఏటో ఆ వొచ్చినోడు మెడ పట్టుకోని పిసికీడానికి తయారు పడిపోనాడట. ఆయమ్మ అంతెత్తు మనిసట. సాలాసేపు నజ్జుగుజ్జులు పడి ఆడి సేతులు ఇడిపించుకొని గట్టిగ కేకేస్సరికి ఆడు బయిపడిపోయి పారిపోనాడట. ఆయమ్మ కాబట్టి అంత సావసం సేసింది. కానీ నాలాటిదాయైతే ఏటౌను. ఆ తరవాత మా బావు మరికొందరు స్నేహితులు ఎల్లి ఆయమ్మకి దైర్యం సెప్పి ఆల

బావుకి పోనుసేసి రప్పించారట.

మనకి తెలిసినోలే, ఇంటిల పనిసేసినోలే, మనకి దగ్గరోలే ఇలపింటి పని సేత్తే తెలీనోల సంగతేటి?' అని అనుకుంటూ బెదురుతూనే కిటికీ రెక్క తీసి బయటకి చూసింది.

చీకటిలో ఆ ఆకారం ఇంటివైపే వస్తోంది. సీతాలమ్మ కిటికీరెక్కను గబీన వేసి ' ఇప్పుడేటి సెయ్యిడం. ఆ వొచ్చింది ఎవులో ఏటో? ఎలాపింటోలో? నన్నొక్కదాన్ని వొదిలీసి ఎల్లిన ఆల్ని అనాలి. సీకటి పడీసరికి ఇంటికి వొచ్చీయాలని తెలీదా ఆలకి. ఎటు సూసినా సీకటి. గట్టిగా కేకేద్దుమంతే ఇరుగుపొరుగు ఎవులూ కనిపించకుంతండ్రు. ఇంత ఇల్లూ కట్టుకొని ఇదేమి గాచ్చారముర బగమంతుడా' అని అనుకుంటూ ఏటి చెయ్యాలో తెలీక గాబరా పడిపోతోంది.



'ఇక్కడికి వొచ్చింతరవాత వొంటిమీద పిసరంత బంగారం ఏసుకుంతే బయ్యిం. అవసరానికని ఇంటిలోన డబ్బులుంచితే బయ్యిం. తెలీని మనుసులొచ్చి మాట్లాడితే బయ్యిం. సీకటి పడినా బయ్యిమే. అలవాటు లేని పని. ఎప్పుడూ తలుపులేసుకోని, తాళాలేసుకోనే ఉండాలి. దానికి తోడు మా బావుకి ఇక్కడకి వొచ్చిన దగ్గిరి నుంచీ సంపాదన యాతన పట్టుకుంది. అదెవులో ఇంటి జాగాలు కొనీసి, అమ్మీసి సైట్ల యాపారం సేస్సి సంపాదించెత్తన్నారట. మా బావూ తయారైపోనాడు. అది మనకి వొద్దురా పశువుల యాపారం, బూవుల యాపారం సెయ్యాలంతే బుర్రమార్పులు తెలియాలి. నీకు అలవాటు లేనిపని. బుర్రమార్పులు నీకు తెలీవు అంతే ఇంతన్నాడు కాదు. " నీకు తెలీదు లేయే" అని ఇంతోఅంతో ఉన్న డబ్బూ, బంగారమూ తీసికెల్లి ఇక్కడి అక్కడ, అక్కడిది ఇక్కడ పెట్టీసి సిందర వందర సేస్సాడు. ఈ తైతక్కల యాపారంలోన నష్టమే వొచ్చిందో, అప్పులే ఐపోనాడో ఈ మద్య ఎప్పుడూ అదోలాగ ఇంతన్నాడు. నాకేటీ సెప్పకుంతాన్నాడు. ఏదో ఐయ్యింది. లేకపోతే ఇంతవరకూ రాకపోడవేటి? ఏటి జరిగింది? అదేటే?' అని ఆలోచించింది.

ముందు రోజు కొడుకు కోడలూ గుసగుసలాడుకోవడం, పేపర్లోని వార్తలు చదవడం, పోన్లో మాట్లాడం, కొంత మంది ఇంటికొచ్చి ఎల్లడం, ఏటైయ్యిందిరా అని అడిగితే " ఏటీ లేదునాయే" అని గసరడం అన్నీ గుర్తుకొచ్చాయి సీతాలమ్మకు.

తలుపు కొట్టిన శబ్దం వినపడింది. సీతాలమ్మ గతుక్కుమంది. తలుపు వైపు చూసింది. తలుపు తీస్తే ఏటొద్దో అన్న భయంతో ఇంట్లో అలాగే కూలబడి పోయింది. ఆ వచ్చిన వ్యక్తి చాలాసేపు తలుపుకొట్టి ఏమీ చేయలేక వెళ్ళిపోయాడు.

చుట్టూ చీకటి. అంతా చీకటి. భయం చీకటి. అనుమానాల చీకటి. అన్ని చీకట్ల మధ్య ఆ ముసలమ్మ కొడుకు, కోడలు రాక కోసం ఆ ఇంటిలోన తలుపులేసుకొని ఎదురు చూస్తూ ఉండిపోయింది.

'ఏటీ బాద. అక్కడ ఊర్లో ఐతే ఎంతేలైనా గడపలోనే కూకుండోలం. యజమాని పొలానికెల్లినా, ఏ ఊరెల్లినా వొచ్చీదాక గడపలోనే మంచం వాల్చుకొని ఉండోలం. ఇప్పుడు కొడుకు కోసం ఎదురు సూడ్డానికి కూడా గడపలో కూర్చోడానికి లేదు. పోనీ ఎవుల్నైనా అడుగుదుమంతే అదీ లేదు. బయ్యిం. పట్నం అంతే బయ్యింగుంది.

ఇక్కడ వొంటికి సుకంగ ఉంది. కానీ మనసుల సుకంగా ఉందా? అక్కడ ఎవకల ఎల్లి పొద్దుపోయిన దాకా పొలాన హాయిగా పని సేసుకుండోలిమి. వొంటికి కష్టంగ ఉన్నా మనసుకి హాయిగా ఉండీది. ఏ సింతా లేక నిద్ర పట్టీసీది.

ఇక్కడ ఏ సిటం ఏ కబురు ఇనపడతాదో అని బయ్యిం. పక్కింటి పిల్లాడ్ని ఎత్తుకెల్లిపోయారని కబురు. రోడ్డు మీదకెల్తే గొలుసులు తెంపికెల్లిపోతన్నారని, ఆడోల్ని పాడుసేసెత్తన్నారని బోగట్టాలు ....' సీతాలమ్మ ఇంకా ఆలోచించలేకపోతోంది. ఆ రాత్రి ఆమెకు కాళరాత్రిగా మారిపోయింది.

బయట ఏదో పెద్ద చప్పుడు. ముసలమ్మ భయంతో బిగుసుకుపోయింది.

తల్లి పక్షి ఇంకా రాలేదేమో గూటిలోని పిల్లలు గోలగోలగా అరుస్తున్నాయి.

ఇంతలో ఎవరో తలుపు తడుతున్నట్టు అనిపించింది.

'ఎవరై ఉంటారు? కొడుకూ కోడలేనా? తలుపు తియ్యాలా? వద్దా? ' అని కొంచెం సేపు తటపటాయించి, సరే కిటికీ తలుపు తీసి చూడాలనుకుంది. బయట చీకట్లో ఎవరూ కనిపించలేదు.

సందేహిస్తూనే లేచి వెళ్ళి తలుపు గడియ మీద చెయ్యి వేసింది.

❋

## విభజన రేఖ

- సి.ఎస్.రాంబాబు
9490401005



వ్యాపారీకరణ వేయి కాళ్ళ జెర్రిలా విస్తరిస్తున్నప్పుడు
పరస్పర వైరుధ్యాలు
జీవిత సత్యాలుగా మారతాయి!
బిందెడు నీళ్ళకోసం
మాటలు యుద్ధాలు జరిగిన చోటే
ఐదు నక్షత్రాల హోటళ్ళలో
క్రికెట్ మైదానాలలో
నీరు యథేచ్ఛగా ఏరులై ప్రవహిస్తూ ఉంటుంది!

పల్లమెరిగిన నీటిని డబ్బు మార్గం పట్టించేశాం కదా
బిందెడు నీళ్ళ కోసం మైళ్ళకు మైళ్ళు నడిచే చోట
చెదిరిన బాల్యం కార్ఖానాలలో బంధీ అయ్యే చోట
గుప్పెడు మెతుకుల కోసం
వలస ఒక చివరి గమ్యంగా మారిన చోట
వెక్కిరిస్తున్నట్లు వినోదం
మద్యమై పారుతుంది!

టీవీ ఛానళ్లై హోరెత్తిస్తుంది
సేదదీరమని కవ్విస్తుంటుది!
అవును
ఇక్కడ పరస్పర వైరుధ్యాలు
భిన్నత్వంలో ఏకత్వంలా
కలిసిపోతుంటాయి!
ఎవరి బతుకు పోరు వారిదే అంటూ
సన్నని విభజన రేఖ
గుండెల్ని చీలుస్తూ ఉంటుంది!

❋

## కరువు నానీలు

- మేరెడ్డి యాదగిరిరెడ్డి
9949415796



కరువు నిధులు
వరదలా పారాయి
కాంట్రాక్టర్ల
పంట పండింది.

కరువు కాలంలో
వలస పక్షులు
ఇంకెవరు
మన రైతన్నలు

బోరు బిక్కింది
పంట ఎండింది
కరువు
రైతు మెడకు వురితాడైంది.

జీవితమంతా పోరాటం
మెతుకు కోసం ఆరాటం
బ్రతుకు పోరాటం
వ్యవసాయం

కరువు కాలం
వాగెండిపోయింది
ఇసుక బ్రోకర్ల
పంట పడింది.

కరువులో
రైతు ఎకరం పొలం అమ్మాడు
కరువు కాంట్రాక్టరు
ఆరో అంతస్తు పూర్తి చేశాడు.

❋

## మరణదండన ఖాయం

- కోగిల చంద్రమౌళి
9573187218



జాతీయత నినాదం ఇప్పుడు
కుట్రలో కూర్చబడుతుంది
కాలనాగులు రాజ్యాధికారం చెలాయిస్తున్నాయి
రాజ్యాంగం కాషాయికరింపబడుతుంది
అనాధికార శిక్షలు నిత్యకృత్యం
చట్టాలు, కోర్టులు అజమాయిషీకి దాసోహం
మానవీయతా, సామాజిక న్యాయం అన్నావో
దేశద్రోహివే..
శిక్ష ఎలా కోరుకుంటే అలా!
రోహిత్ వేములా, కల్బుర్గిల్లా
చస్తావో - చంపబడతావో నీ యిష్టం
మరణ దండన మాత్రం ఖాయం

❋

### తప్పిన కొద్దీ చరిత్ర - 2

# అనంతపురం జిల్లాలో కన్నడ శాసనాలు



- ఈమని శివనాగిరెడ్డి
9848598446

ఆంధ్రప్రదేశ్‌కు నైరుతి దిక్కులోనున్న అనంతపురం జిల్లా కర్ణాటక రాష్ట్ర సరిహద్దుగా ఉండి, కన్నడ ఏలికల పాలనలో ఉండేది. అనంతపురం జిల్లాలో దాదాపు 180 కన్నడ శాసనాలున్నాయి. రాజవంశాల వారీగా బాదామీ చాళుక్యుల శాసనాలు - 3, రాష్ట్ర కూటుల శాసనం -1, బాణుల శాసనం -1, యాదవరాజుల శాసనం -1, హేమావతి రాజుల శాసనాలు -5, తాడిపత్రి రాజుల శాసనం-1, నొలంబ పల్లవుల శాసనాలు -28, కళ్యాణ చాళుక్యుల శాసనాలు- 37, హొయసల రాజుల శాసనాలు 9, విజయనగర రాజుల (నాలుగు వంశాలు కలిసి) శాసనాలు -93 ఉన్నాయి. ఈ శాసనాల్లో ఎన్నో రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక విషయాలున్నాయి. వివరాల్లోకి వెళితే, బాదామీ చాళుక్య రాజులైన రెండో పులకేశి, విజయాదిత్య సత్యాశ్రయ, కీర్తివర్మ సత్యాశ్రయుల శాసనాలున్నాయి. పెదవడుగూరులోని క్రీ.శ. 7వ శతాబ్దికి చెందిన సత్యాశ్రయుని శాసనంలో అతనిపేరు ఎఱెయితి ఎడిగల్ అని పేర్కొనటమే కాక, అతడు రణవిక్రముడనే బాణరాజును జయించాడనీ, ఈ శాసనాన్ని రాసిన మహేంద్రపల్లవ ఆచారి అనే శిల్పికి 12 మఱుతుర్ల భూమిని దానం చేసిన వివరాలున్నాయి. ఇందులో శిల్పికి 'మహేంద్ర పల్లవ' అన్న బిరుదుండటాన, బహుశ అతడు పల్లవ ప్రాంతం నుంచి వలస వచ్చిన నైపుణ్యం గల శిల్పిగా భావించవచ్చు.

బేటపల్లిలోని బాదామీ చాళుక్య రాజైన విజయాదిత్య సత్యాశ్రయుని శాసనంలో బాణరాజుకు మామ అయిన విక్రమాదిత్యుడు, ఒక తలారికి 25 మరుతుర్ల నల్లరేగడి, 50 మరుతుర్ల ఎర్రనేల, 1 మరుతురు మాగాణి, 236 మడుల అడవి భూమి (కీసుకాడు) ని దానం చేసిన వివరాలున్నాయి. విక్రమాదిత్యునికి తరుణ వసంతన్, సామంతకేసరి అనే బిరుదులున్నట్లు, శాసనాన్ని శింగుట్టి అనే శిల్పి చెక్కినట్లు కూడా ఉంది.

జిల్లాలో రాష్ట్రకూటుల ఒకే ఒక కన్నడ శాసనం హేమావతిలో ఉంది. క్రీ.శ. 9వ శతాబ్దిలో రాష్ట్రకూట రాజైన అమోఘవర్ష మొదటి నృపతుంగుని వీరశిల శాసన పలకంలో పైన శాసనం మధ్యలో పద్మాసనంలో ధ్యానముద్రలోనున్న వ్యక్తి బొమ్మ ప్రక్కన పేర్చిన చితి ఉన్నాయి. అమోఘవర్షుని సైన్యాధ్యక్షుడైన బంకేయరసుని కుమారుడు కుందతె, 30 రోజుల సన్యాసన దీక్ష తీసుకొని స్వచ్ఛంద మరణాన్ని పొందాడనీ, అతను చనిపోయిన తరువాత అతని సేవకుడైన అత్యుదయయశుదు, సదమలచరిత అని బిరుదులు గల మైలమ్మ చితిలో దూకి చనిపోయాడని ఉంది.

గోరంట్ల సమీపంలోని బుదలిలో వరభుజాసి భాసుర, ప్రచణ్డ ప్రత్యుతర, దిన కార, కులనన్దన, కావేరీనాతహారయూరి

పురివరాధీశ్వర బిరుదాంకితుడైన చోళ మహారాజు (పేరులేదు), బ్రాహ్మణులకు 12 పుట్ల భూమిని దానం చేసిన వివరాలున్నాయి. జిల్లాలో దొరికిన చోళ శాసనం ఇదొక్కటే.



శనగలగూడూరులోని క్రీ.శ. 800 నాటి బాణరాజు చండియణ్ణ శాసనంలో అతనికి జగత్త్రాయాభివన్విత, సురాసురాధీశ, పరమేశ్వర, పతిహారిశ్రిత, మహాబలి కులోద్భవ, కృష్ణధ్వజ విలంబిత, వృషభలాంఛన బిరుదులున్నట్లు, పెంబక పళుకు చెందిన మహాజనులకు పొన్నెతెరె అను పన్నునుంచి వచ్చిన ఆదాయాన్ని దానంగా ఇచ్చినట్లు పేర్కొనబడింది.

జిల్లాలో నొలంబపల్లవులకు సంబంధించిన 28 శాసనాలు లభించాయి. క్రీ.శ. 878లో మహేంద్ర నొలంబుని శాసనం మొదటిది కాగా, క్రీ.శ. 1074లో జయసింగదేవుడు విడుదల చేసినది చివరి శాసనం. క్రీ.శ. 936 వ సంవత్సరపు గుణిమోరుబాగులు గ్రామంలోని వీరనొలంబ అయ్యణదేవుడు రాజ్యం చేస్తుండగా, ఆయన మహా సామన్తాధిపతి నొలంబీశ్వర స్థానాధిపతి అయిన వరుణ శివభటారుడు స్థానిక గావుండులతో కలిసి చెరువు నిర్వహణకు చేసిన దాన వివరాలున్నాయి. మడకశిరలోని చోళరాజు దేవాలయములోని శాసనంలో నొలంబ పల్లవరాజు దిలీపుడు రాజ్య పాలనలో ఉండగా క్రీ.శ. 949వ సంవత్సరంలో తన సేనాని బలాహుడు, చోళరాజైన గజాంకుశునిపై దండెత్తి యుద్ధంలో చనిపోయినట్లుగా ప్రస్తావించబడింది. నొలంబ పల్లవులకు, చోళులకు జరిగిన యుద్ధాన్ని ఈ శాసనం పేర్కొంటుంది. హొన్నెరహళ్లిలోని నొలంబరాజైన ఇరివనొలంబ నొళిపయ్య, రొళ్ళియనూరు గ్రామ ప్రజలు, దొంగలతో తలపడి మరణించగా వారి స్మృతి చిహ్నంగా వీరశిలను ఎత్తించినట్లు చెప్పబడింది. నొలంబరాజు రాజ్యం చేస్తుండగా హేమావతిలోని క్రీ.శ. 966-67 నాటి శాసనంలో పురానికి చెందిన జగళ మొగులెయరస మరియు నొలంబాధిరాజు కుమారుడైన అయ్యపదేవుడు, పిరియబ్బరసిలకు మధ్య జరిగిన యుద్ధంలో, ఎఱెయమ్మ అనే వీరుడు కడు సమర్ధవంతంగా పోరాడి, మరణించి, ప్రజల మన్ననలు పొందాడని చెప్పబడింది. నరసింగరాయని రొప్పలోని వీరశిలపై గల క్రీ.శ. 10వ శతాబ్ది నాటి శాసనంలో, నొలంబాధిరాజు పాలిస్తుండగా, నాచమగావుండ అనే సైనికుడు, శత్రువులకు చెందిన నాలుగు సైన్య సమూహాలను సంహరించి, వీర మరణం పొందాడని చెప్పబడింది. ఫలారంగొల్లరహట్టి అనే గ్రామ పొలాల్లో ఉన్న ఒక రాతిపైన, నొలంబ పల్లవాధి రాజు పాలిస్తున్నప్పుడు, పూణిగ అనే కుక్క ఎలుగుబంటితో పోరాడి మరణించగా, ఆ కుక్క జ్ఞాపకంగా ఒక వీరశిలను ఎత్తించారనీ, ఒక ముఖ్యుడు తన్నూరు, చోరగిరి పాలిస్తుండేవాడనీ ప్రస్తావిస్తుంది.

హేమావతిలోని హొంజేరప్ప దేవాలయం ఎదురుగా నిలిపిన క్రీ.శ.10వ శతాబ్దికి చెందిన ఒక శాసన స్థంభంపైన పల్లవాధి రాజు కుమారుడు పల్లవకులతిలక బిరుదాంకితుడైన నొలంబాధిరాజు పాలనలో, రాణి జాయబ్బె కుమారుడైన మహేంద్ర రాజు తన దాయాదులను చంపి, బరగూరులో విడిది చేసినప్పుడు ఈ శాసనం వేయబడిందని చెప్పబడింది. రాణి జాయబ్బె, నీతిమార్గ పెర్మాడి రాణి కొడుకని చెప్పబడింది. ఈ శాసనంలో నొలంబులకు, పశ్చిమ గాంగులకు వైవాహిక సంబంధాలుండేవనీ, అలాగే దాయాదుల మధ్య అధికారం కోసం కుమ్ములాటలుండేవని తెలుస్తుంది. అక్కడే ఉన్న అదే కాలపు మరో శాసనంలో నొలంబాధి రాజు, ఇచ్చిన పొళనినాడులోని బరగూరును బిజయుతమ్మదేవి పాలిస్తుందనీ, అలాగే అక్కబ్బె సియవూరును, దొమ్మబ్బె త్రైలోక్యవొళాలును పాలిస్తున్నారనీ, ఆ సందర్భంగా, ఒక జైన బసదికి కొన్ని భూములను దానం చేశారనీ చెప్పబడింది. క్రీ.శ. 10వ శతాబ్దిలో నొలంబ పల్లవరాజ్యంలో కొన్ని మండలాలను స్త్రీలు పాలించేవారనీ, తెలుగు నేలపై స్త్రీలు సామంతులుగా నియమింపబడినట్లు తెలిపే శాసనం ఇదొక్కటేనని చెప్పవచ్చు. కలుగోడులో గ్రామానికి దక్షిణంగా పొలాల్లో నున్న క్రీ.శ. 977వ సంవత్సరపు శాసనంలో నొలంబ పల్లవ రాజు మయ్యమ్మ బరగూరు నుంచి పాలిస్తున్నాడనీ, యుద్ధంలో చనిపోయిన ఎఱెగంగయ్య కుటుంబానికి చితిలో ((కీల్గుంటె) ప్రవేశించి బలిదానం చేసుకొన్న కళనేనరసుని కుమారుడు మయ్యమకు కల్నాడు గ్రామాన్ని దానం చేసిన వివరాలున్నాయి. కృతయుగ చోళ అయితా చారి అనే శిల్పి ఈ శాసనాన్ని చెక్కాడు.

జిల్లాలో ఉన్న నొలంబ పల్లవ శాసనాలు జిల్లాలోని హెంజేరు – హేమావతి నుంచి పాలించిన మహేంద్ర నొలంబ (క్రీ.శ. 878), మొదటి మహేంద్రుడు (క్రీ.శ. 883), నొలంబాదియరస; వీర నొలంబరాజ (క్రీ.శ. 9వ శతాబ్ది) వీరనొలంబ అన్నయ్య దేవ (క్రీ.శ. 936), అయ్యపదేవ (క్రీ.శ.

10వ శతాబ్ది), దిపరుస (క్రీ.శ. 943-49), ఇరివనొలంబ (క్రీ.శ. 950), నొలంబాధి రాజు (క్రీ.శ. 959), ఇరివనొలంబ నొళిపయ్య (క్రీ.శ. 963), ఇరివనొలంబాధి రాజ (క్రీ.శ. 965), నొలంబాధిరాజ (క్రీ.శ. 966), దిలీపయ్య ఇరివనొలంబ, నొలంబాధిరాజ (క్రీ.శ. 10వ శతాబ్ది), మైయ్దమ్మరస (రెండో మహేంద్ర), రెండో వీర మహేంద్ర (క్రీ.శ. 10వ శతాబ్ది), ఇరివ నొలంబ ఘటెయుక కారపల్లవాదిత్య (క్రీ.శ. 11వ శతాబ్ది), జయసింగదేవ (క్రీ.శ. 1014) అనే రాజులు ప్రస్తావించబడినారు. దాదాపు రెండు శతాబ్దాల పాటు తెలుగునేలను పాలించిన 20 మంది నొలంబ పల్లవ రాజుల గురించి, వారి పాలన గురించి చరిత్ర పాఠ్యాంశాలలో చోటు దక్కకపోవటం విచారించదగ్గ విషయం.

జిల్లాలో కళ్యాణ చాళుక్య రాజులైన ఆహవమల్ల త్రైలోక్యమల్లి త్రైంబకమల్లు మొదటి సోమేశ్వర, త్రిభువనమల్ల, విక్రమాదిత్య- మూడో తైలప, త్రిభువనమల్ల నాలుగో వీర సోమేశ్వరులు విడుదల చేసిన 37 కన్నడ శాసనాలున్నాయి.

పులకుర్తిలోని త్రిలోక్యమల్ల మొదటి సోమేశ్వరుని క్రీ.శ. 1058 నాటి శాసనంలో, అతడు కోలూరు నుంచి రాజ్యం చేస్తున్నాడనీ, అతని మహా సామన్తుడు బాజబ్బరస దండనాయకుడైన గోపన్న అభ్యర్థనపై వేములవాడ - పులకురుకె గ్రామంలో జనాలకు కొంత భూమిని దానం చేసిన వివరాలున్నాయి. తెలంగాణాలోని వేములవాడ పేరుతో రాయలసీమలో మరో వేములవాడ ఉన్నట్లు ఈ శాసనం వల్ల తెలుస్తుంది. దోణెకల్లులోని ఇదే రాజు విడుదల చేసిన క్రీ.శ. 1060 వ సంవత్సరం శాసనంలో, త్రిలోక్య మల్లుడు, దక్షిణ దిగ్విజయయాత్రకు వెళ్ళినప్పుడు, శంకరస కొండకుందెను పాలిస్తుండగా, చిద్దయ్య, జక్కయ్య అనే ఇద్దరు బ్రాహ్మణులు, నిజ్జర గ్రామంలో, చల్కగావుండ, చందయ గావుండలకు చెందిన ఉంబలి భూమిని మూడేళ్ళుగా ఆక్రమించుకోగా, ఆ భూమిని స్వాధీనం చేసుకోవటానికి ముగ్గురు గావుండలు బ్రాహ్మణులతో తలపడినప్పుడు, ముగ్గురిలో ఎవరైనా చనిపోతే వారికి బతికున్న వాళ్ళు వాళ్ళకొచ్చిన భాగంతోపాటు, మరో మూడోవంతు అధికంగా ఇవ్వాలని తీర్మానించుకున్నారు. పోరాటంలో నిజ్జరీగావుండ చనిపోగా, అతని కొడుకు మంచిగావుండకు మిగిలిన ఇరువురూ అనుకొన్నట్లుగానే ఎక్కువ భూమిని పంచి ఇచ్చారు. కొర్రెపు లోని జగదేకమల్లుని శాసనంలో అతని సామంతుడైన మహావుండలేశ్వర వీరనొలంబ బమ్మదేవ చోళ మహారాజు గోవిందవాడి నుంచి పాలిస్తుండగా, స్థానిక కమ్మటేశ్వర దేవునికి కొంత ఆదాయాన్ని సమకూర్చినట్లు చెప్పబడింది. బంగారం పని చేసే కంసాలీలు, నిప్పు వెలిగించుకొని పెట్టుకొనేదాన్ని కమ్మటం అంటారనీ, అలాగే టంకశాలలో నాణేలను పోతపోసే ముందు లోహాన్ని కరిగించే పాత్రను కూడా కమ్మటం అంటారనీ, వారి అధిదేవత కమ్మటేశ్వరుడనీ చెప్పబడింది.

హేమావతిలోని హెంజేరప్పదేవాలయ ద్వారశాంపై ఉన్న క్రీ.శ. 1162 నాటి శాసనంలో మూడో తైలపుని సామంతుడైన త్రిభువనమల్ల దేవ చోళ, మహారాజు సీరే నాడు ముఖ్య పట్టణమైన హెంజేరు నుంచి పాలిస్తుండగా, స్థానిక దేశ్వీర దేవుని ప్రతిష్టించిన రాజరాజ వెలనాడుకు చెందిన అకూరు వారైన ఆలవాయి మళ్ళవాళ, అండమ్మెల కొడుకు పెరియాళువశెట్టి, కొంత భూమిని దానం చేసిన వివరాలున్నాయి. ఇందులో కృష్ణాతీరంలోని వెలనాడును, రాజరాజ వెలనాడుగా పేర్కొనటం గమనించాల్సిన విషయం. అదే దేవాలయం ముందున్న క్రీ.శ. 1167 నాటి ఒక స్థంభ శాసనంలో హెంజేరు నుంచి పాలిస్తున్న త్రిభువనమల్ల దేవచోళ మహారాజు, అతని రాణి, సీతాదేవియరని కలిపి నొణంబేశ్వరునికి అక్కడున్న మహాఘటికస్థానానికి, రాజ గురువైన అనంతశివదేవుని సమక్షంలో, ఇంకా సత్ర నిర్వహణకు వెదులచింతె గ్రామాన్ని దానం చేసిన వివరాలున్నాయి.

ఇంకా జిల్లాలో హొయసల వంశానికి చెందిన రెండో వీరభల్లాలు (క్రీ.శ. 1178) ని శాసనం, యాదవరాజులైన సింఘనిదేవు (క్రీ.శ. 1215) ని శాసనం, హేమవతి రాజులైన మొదటి ఇరుంగొడు దేవుడు (క్రీ.శ. 12వ శతాబ్ది), మల్లదేవచోళ, భోగ దేవచోళ (క్రీ.శ. 1196), రెండో ఇరుగొళ దేవత (క్రీ.శ. 1277) శాసనాలు, తాడిపత్రికి చెందిన ఉదయమల్లుని (క్రీ.శ. 1208) శాసనం, విజయనగర శాసనాలు, జిల్లాకే కాక, రాయలసీమ ఆంధ్రప్రదేశ్ సమగ్ర చరిత్ర తెలుసుకోవటానికి ఎంతగానో ఉపయోగపడతాయి. అయితే తెలుగు అకాడెమీ ప్రచురించిన బిఏ, ఎంఏ చరిత్ర పాఠ్యపుస్తకాల్లోని తెలుగునేలను పాలించిన రాజుల్లో, చోళనొలంబ, హొయసల రాజుల ప్రస్తావన లేకపోవటం శోచనీయం. ఇప్పటికైనా పాఠ్యప్రణాళిక కమిటీ సభ్యులు మేల్కొని, సవరించి, తెలుగునేలపై గల కన్నడ శాసనాల్లోని విషయాలను పాఠ్యాంశాల్లో చేర్చాలని మనవి తప్ప అంతకంటే ఏం చేయగలం?.

❋

# గజల్

- రేగులపాటి కిషన్‌రావు
9680606404

నియతి శూన్యులైనవారు స్ఫూర్తి దాతలవుతారా
నేరస్థుల కాచువారు న్యాయవాదులవుతారా.

జ్ఞానదాత ఆ గురువే వ్యసనలోలుడైపోతే
విద్యార్జన చేయువారు బుద్ధిమంతులవుతారా.

తండ్రిగారు పదేపదే తాగి వాగి తూలుతుంటె
అర్భకులగు ఆ తనయులు సద్వర్తనులవుతారా.

అగ్రజుడే చదువుమాని జూదరియై తిరుగుతుంటె
వెంట తిరుగు సహోదరులు సదాచారులవుతారా.



పదవి పొంది నాయకుడే దుష్టార్జన కెగబడితే
విజయదాతలైన సరె మౌనమూర్తులవుతారా.

పాలకులవి పలుపలుకులు శూన్యములైపోతుంటే
పాలితులగు విబుధవరులు సంతృప్తులు అవుతరా.

పాలనలో అక్రమాలు అలా అలా సాగుతుంటె
బాధితులగు సత్పౌరులు సహనవంతులవుతారా.

నవ్యముగా రమ్యముగా రచనచేయు రేకిరావు
ప్రతిభ మీకు లేకుంటే ఉత్తమ కవులవుతారా.

---

# ఓ నా దేశమా..!

- గవిడి శ్రీనివాస్
9966550601

నడకలు మారాయి
స్వాతంత్ర్యానంతరం
సంకెళ్ళ రూపాలు మారాయ్.
ఇప్పటి బానిసత్వం
కొత్త అర్థాల్లో జీవిస్తోంది .

కాల పరిమితి లేని
పనిగంటలు పొద్దస్తమానం
రెక్కల పై వేలాడుతూనే ఉంటాయ్.
శ్రమజీవులు
నిశ్శబ్ద జీవితాన్ని సాగిస్తుంటే
ఫలితం హత్తుకునే జీవికలు
ఎత్తున మాట్లాడుతుంటాయ్.
భరోసా లేని బతుకుల్లో
జీవితం తడబడుతోంది .

రైతు మట్టి నాదని హత్తుకుంటే
గుండె గుభేల్ మనిపించే
సందర్భాలు అంటిపెట్టుకు తిరుగుతున్నాయ్
ప్రాపంచీకరణ ప్రపంచంలో
సన్నకారు రైతు జీవించనూ లేదు
కిళ్ళీ కొట్టు వాడు బతుకు సాగించనూ లేదు



సంతా లేదు సందడీ లేదు
సంక్షేమమూ లేదు
చిన్న కూరగాయల కొట్టు లేదు
మాల్స్ మాయాజాలం లో
కొట్టుకు పోతున్నాయ్ .
నిన్ను నువ్వు కోల్పోతున్నావ్
నీ నీడ నూ కోల్పోతున్నావ్

నా రైతుకు రాజ్యమేది.
నా కార్మికునికి సంక్షేమ చట్టమేది .

ఓ నా దేశమా
స్వశక్తి ఉపాధి మార్గమా
నా కలల ప్రపంచమా
సమసమాజ స్థాపనలో
వెలుగు రేఖలు రువ్వుకుంటూ రావూ ..!

# 'చెరుగ్గడ'లో జీవిత సత్యాలు




- డా॥ గుమ్మా సాంబశివరావు
9849265025

ఆధునిక కవిత్వంలో వచ్చిన ప్రక్రియల్లో 'రెక్కలు' ఒకటి. దీని సృష్టికర్తగా ప్రసిద్ధులు ఎం.కె.సుగమ్‌బాబు. పైగంబర కవుల్లో ఒకరిగా సాహిత్యలోకానికి పరిచితులైన సుగమ్‌బాబు సృష్టించిన రెక్కలు ప్రక్రియ ఆధునిక కవుల్ని బాగానే ఆకట్టుకోవడం వల్ల చాలా సంపుటాలు వచ్చాయి. సుగమ్‌బాబు వెలువరిస్తున్న నాల్గో సంపుటి 'చెరుగ్గడ'.

రెక్కలన్నీ ముక్తకాలే. ఆరు పాదాల్లో ఉంటాయి. మొదటి నాలుగు పాదాల్లో చెప్పదలచుకొన్న విషయాన్ని ప్రతిపాదించి ఆ తర్వాత రెండు పాదాల్లో ప్రతిపాదించిన విషయాన్ని సమర్థించే భావం ఉంటుంది. ఇందులో చివరి రెండు పాదాలు ఎంతబలంగా ఉంటే ఆ రెక్క అంత పుష్టిమంతంగా ఉంటుంది. ఈ రెండు పాదాలు ఒక్కోసారి చదవగానే అర్థమయ్యేవిగా ఉండవచ్చు. మరోసారి ఆలోచనామృతాలు కావచ్చు. ఏదిఏమైనా రెక్కలు ప్రక్రియ తెలుగు సాహిత్యంలో ప్రస్తుతం బాగానే ప్రచారంలో ఉందని చెప్పవచ్చు.

సుగమ్‌బాబు 'చెరుగ్గడ' పేరుతో రెక్కల సంపుటిని వెలువరించారు. ఈ సంపుటికి రాసిన ముందుమాటలో కవి "ఈ రెక్కలు అర్థం కావాలన్నా, రుచి తెలియాలన్నా బుర్రకు పని పెట్టాల్సిందే. పైకి కనిపించే పదాలకు లోపల ఉద్దేశించిన ప్రయోజనం వెంటనే కనెక్ట్‌కాదు. అంచేత మళ్లీమళ్లీ ఆలోచించక తప్పదు." అని చెప్పారు. దీన్నిబట్టి ఇందులో పొందుపరిచిన రెక్కలు ఆలోచనాత్మకాలని చెప్పాలి. ఈ సంపుటిలోని రెక్కల్లో జీవనతత్వాన్నే ప్రతిపాదించినా ఇందులో ఒక విమర్శను జోడించినట్లు కవి పేర్కొనటం గమనార్హం. సమాజాన్ని జాగ్రత్తగా పరిశీలించిన కవి వివిధ మనస్తత్వాల్ని, వివిధ ప్రవర్తనల్ని, వివిధ వాస్తవికతల్ని రెక్కల రూపంలో అందించారు.

నాగరికత ఎంత అభివృద్ధి చెందినా, మానవుడు శాస్త్ర సాంకేతిక రంగాల్లో ఎన్ని విజయాలు సాధించినా కొన్ని విషయాల్లో ఇంకా కుంచించుకునే ఉన్నాడని గమనించవచ్చు. ఇప్పటికే ఆడపిల్ల పుడితే బాధపడేవారు ఎంతోమంది ఉన్నారు. ఈ విషయాన్నే గుర్తించిన కవి -

**"కొడుకైతే/కొండను పిండి కొడతాడా?/ఆడపిల్లంటే/ అసంతృప్తా?/చిన్న బుద్ధితోనే/చిన్నచూపు"** - అనే రెక్కను రచించారు.

ఇక్కడ మొదటి నాలుగు పాదాల్లో ఆడపిల్ల పుడితే అసంతృప్తిని ప్రకటించే వారి మనస్తత్వాన్ని ప్రశ్నించారు. కానీ చివరి రెండు పాదాల్లో చిన్నబుద్ధులు అంటే కుఅచ బుద్ధులు లేదా అల్పబుద్ధులు ఉన్నప్పుడు మాత్రమే ఆడపిల్ల పట్ల చిన్నచూపు ఉంటుందని, విశాల దృష్టితో చూస్తే ఎవరైనా ఒకటేననే సత్యాన్ని పరోక్షంగా ప్రకటించారు. అయితే ప్రస్తుతం ఈ అభిప్రాయం కొద్దిగా మారుతూ "కంటే కూతుర్నే కలాలి" అనే ఆలోచన కూడా బలపడడం శుభసూచకం.

పుట్టిన ప్రతి జీవి మరణించక తప్పదు. కాలం గడిచే కొద్దీ వృద్ధాప్యం సమీపిస్తుంది. వృద్ధాప్యం అంటే మృత్యువు నీడకు చేరుకోవటమేననే సత్యాన్ని వివరిస్తూ

**"ఎంత జాగ్రత్తగా/తొడిగినా/చిరిగి పోతుంది/బట్ట/ మృత్యుఛాయ/వృద్ధాప్యం!"** - అని రచించారు. బట్ట శాశ్వతం కాదు. కాలం గడిచే కొద్దీ పాతబడిపోయింది. జాగ్రత్తగా దాన్ని

తొడగాలని ప్రయత్నించినా అది చిరిగిపోతుంది. అలాగే శరీరం కూడా యౌవనంలోని పటుత్వం వృద్ధాప్యంలో ఉండదు. మృత్యుముఖంలోనికి వెళ్లాల్సిందే. ఈ రెక్కను చదివినప్పుడు భగవద్గీతలోని "వాసాంసి జీర్ణాని యథావిహాయ" శ్లోకం గుర్తుకు రాకమానదు.

ఎవరైనా పరిస్థితుల్ని తమకు అనుకూలంగా మార్చుకోవాలి. అవకాశం కోసం ఎదురుచూడకూడదు. అవకాశం జారిపోతే అదృష్టాన్ని కోల్పోవలసి వస్తుంది. అందుకే వ్యక్తిత్వ వికాస ప్రభోదంతో నిండిన రెక్కను కవి ఇలా రచించారు.

***"ఒకటి కాకపోతే/మరోటి/అందిపుచ్చుకోవాలి/అవకాశాన్ని/పర్సు చేజారితే/పస్తే!"***

ఎంతోమంది బద్ధకస్తులు ముంగిటిదాకా వచ్చిన అవకాశాన్ని పట్టించుకోకుండా మరో అవకాశం కోసం ఎదురుచూస్తూ ఉంటారు. కానీ ఎక్కడో ఒకచోట అవకాశాన్ని అంది పుచ్చుకోకపోతే జీవితంలో సుఖాన్ని కోల్పోతాడు. అందుకే 'పర్సు చేజారితే పస్తే' అనే ప్రభోదాన్ని కవి గావిస్తున్నాడు. ఇక్కడ పర్సు అంటే అవకాశం. అవకాశాన్ని చేజార్చుకుంటే ఆకలితో అలమటించక తప్పదనే హెచ్చరికను కవి చేశారు. అవకాశాన్ని అందిపుచ్చుకున్నవాడే అందలమెక్కుతాడనే పరోక్ష ప్రబోధం ఇందులో ఉంది. కవి ముందుమాటలో చెప్పినట్లు కొంచెం ఆలోచిస్తే భావ మాధుర్యం అందుతుంది.

స్తబ్దంగా ఉండటం మంచిది కాదు. చలించాలి. స్పందించాలి. ఇది సమాజం. సమాజంలో రకరకాల మనుషులుంటారు. ఒకరితో ఒకరికి పరిచయం ఏర్పడితేనే భావ వినిమయం జరుగుతుంది. ప్రయత్నాలు ఫలిస్తాయి. అందుకే కవి

**"పరిచయమేలేని/మనుషులతో/పనులెట్లా/అవుతాయ్?/గెలకొడితేనే/తాటిముంజ"** – అని రచించారు. గెల కొట్టటం అంటే ప్రయత్నించటం. తాటిముంజ ఫలితానికి ప్రతీక. పరిచయాలు పెంచుకోవటం అనే ప్రయత్నం చేస్తేనే ప్రయత్నాలు ఫలిస్తాయనే జీవన సత్యాన్ని కవి ఇక్కడ పొందు పరిచారు.

ఆధునిక సమాజంలో మనిషి తత్త్వం మాయమై పోతున్నదనే ఆందోళన ఉంది. నిర్మలత్వానికి దూరంగా, నిజాయితీకి ఎడంగా మసలుతూ పైకి మాత్రం ఎంతో స్వచ్ఛంగా కనిపించే ప్రయత్నం చేసేవారు కోకొల్లలు. లోపల ఒక విషాన్ని నింపుకొని బయటకు అమృతాన్ని ఒలికించే వారే ఈ సమాజంలో ఎక్కువగా కనిపిస్తున్నారని చెబుతూ కవి

**"వికారాలకు/చిరునవ్వు పులమడం/ఆధునిక/నాగరికత/మేడిపండు/మెరవదా!"** – అని రచించారు. జీవితంలో నటించే వారు చాలా మంది ఉన్నారని కవి ప్రబోధం. పైకి మేలు చేసేవారిలాగా కనిపిస్తారు. కాని వెనుక గోతులు తవ్వుతారు. లోపల వికారం ఉంటుంది. పైకి మాత్రం చిరునవ్వులు చిందిస్తారు. ఇలాంటి వారు మేడిపండు చందంగా కనిపిస్తారు. మేడిపండు పైకి మెరుస్తున్నా లోపల పురుగులతో ఉంటుంది. మెరుగుల్ని చూసి మోసపోవద్దనే హెచ్చరిక కూడా ఇందులో ఉంది. ఈ రెక్క చదివినప్పుడు "మేడిపండు చూడ మేలిమై యుండును" అనే వేమన పద్యం గుర్తుకు రాకమానదు.

పురుషాధిక్య సమాజంలో పురుషులు తప్పులు చేస్తూ స్త్రీలను నిందిస్తూ ఉంటారని, అసలు దోషమంతా పురుషులదేననే భావాన్ని ఆలోచనాత్మకంగా నింపి–

**"స్త్రీలు/స్వార్థపరులన్నారు/కాపురం చేసే/మగాళ్లే/కొత్త గూళ్లు/ కట్టేదెవరు?"** – అన్ని ప్రశ్నించారు. 'కొత్తగూళ్లు' చక్కటి ప్రయోగం. వేరే కాపురాలనటానికి కొత్తగూళ్లు అనటం బాగుంది.

శక్తికి మించిన పనిచెయ్యకూడదని కవి సామాజిక ప్రబోధం గావిస్తున్నారు. ఒక పని చెయ్యబోయేటప్పుడు ఆ పని తన వల్ల అవుతుందా? కాదా? అని ఆలోచించాలి. అంతేగాని ఎంత పనినైనా చేసేస్తాననుకోవటం తప్పే. అలాంటి ప్రయత్నం చేస్తే ప్రమాదం ఎదురవుతుందని కవి హెచ్చరిస్తూ

**"ఎవరేమనుకున్నా/ఇబ్బంది లేదు/చేయకూడదు/శక్తికి మించినపని/పులితో/పరాచికాలా?"** – అనే రెక్కను రచించారు.

– చివరి రెండు పాదాల్లో ప్రమాదపు హెచ్చరిక ఉంది. ఇది ముందు చెప్పిన భావానికి దృష్టాంతంగా చెప్పబడింది. కాబట్టి శక్తికి తగ్గ ప్రయత్నమే చెయ్యాలని గుర్తించి మెలగటం మంచిది. ఇలాంటి భావన్నే మరో కవితలో

**"నిలబడలేడు/కానీ/తెంచాలంటాడు/నక్షత్రాల్ని/గొంతెమ్మ/కోరికలు "** – అని వెల్లడించారు.

నక్షత్రాల్ని అందుకోవటం అసాధ్యం. వాటిని తెంచాలనుకోవటం మరింత సాహసం. అలాంటి వాడి శక్తి ఎలాంటిదని ప్రశ్నిస్తే అతడు కనీసం నిలబడలేడని తెలుస్తుంది. మరి అలాంటివారు నక్షత్రాల్ని ఎలా తెంచుతారు. ఇక్కడ శక్తిని గుర్తించలేని తత్త్వం స్పష్టమవుతుంది. శక్తికి మించినపని, సాధ్యం కాని ప్రయత్నం ఈ విషయాన్ని బలపరచటానికి కవి 'గొంతెమ్మ



## గూటాల కృష్ణమూర్తి కన్నుమూత

ఆచార్య గూటాల కృష్ణమూర్తి (88) జూలై 13న విశాఖపట్నంలో తుదిశ్వాస విడిచారు. తొమ్మిది నెలల క్రితం లండన్ నుంచి వచ్చి, విశాఖలో ఉంటున్నారు. మహాప్రస్థానం గేయాలను శ్రీశ్రీ సొంత గొంతుతో రికార్డు చేయించారు. ఆ పుస్తకాన్ని శ్రీశ్రీ స్వదస్తూరితో విదేశాంధ్ర ప్రచురణగా అందంగా అచ్చు వేయించారు. గూటాల కృష్ణమూర్తి స్వయంగా రచయిత అయినప్పటికీ.. తన రచనలు కన్నా ఇతర ప్రముఖుల రచనలకు ఎక్కువ ప్రాచుర్యం కల్పించే కృషి చేశారు. శ్రీశ్రీ ఇంగ్లాండు పర్యటనను ఆయనే ఏర్పాటు చేశారు. ఇంగ్లాండులో జి.కె.గా ప్రసిద్ధుడైన గూటాల కృష్ణమూర్తి 1928 జూలై 10వ తేదీన ప్రస్తుత ఒడిశాలోని పర్లాకిమిడిలో జన్మించారు. విజయనగరంలోనూ, విశాఖపట్నం ఎవిఎం కళాశాలలోనూ, ఆంధ్ర విశ్వవిద్యాలయంలోనూ విద్యనభ్యసించారు. ఆంగ్ల సాహిత్యంలో ఆనర్స్ పూర్తి చేశారు. మూడేళ్లు అమలాపురం ఎస్‌కెబిఆర్ కాలేజీ, మరో మూడేళ్లు బిలాస్‌పూర్ కాలేజీలో ఆంగ్ల అధ్యాపకుడిగా పనిచేశారు. సాగర్ విశ్వవిద్యాలయంలో 'ఫ్రాన్సిస్ థామస్ - ఎ క్రిటికల్ బయోగ్రఫీ' అన్న అంశంపై పరిశోధన చేపట్టారు. 1962లో లండన్ వెళ్లారు. లండన్ టైమ్స్ పత్రికా కార్యాలయంలో పనిచేసారు. అక్కడ తన పిహెచ్‌డి కొనసాగించి 1967లో డాక్టరేట్ పొందారు. ఆ తర్వాత ఇన్నర్ లండన్ ఎడ్యుకేషన్ అథారిటీ సర్వీసులో ప్రవేశించి లండన్‌లోని వివిధ విద్యాలయాల్లో అధ్యాపకునిగా పనిచేశారు. కృష్ణమూర్తి భార్య వెంకటరమణ బెనారస్ విశ్వవిద్యాలయం నుంచి ఆర్గానిక్ కెమిస్ట్రీలో ఎమ్మెస్సీ పట్టభద్రురాలు. వివిధ కళాశాలల్లో అధ్యాపకురాలిగా పనిచేశారు. వీరికి ముగ్గురు సంతానం. ఇద్దరు అబ్బాయిలు, ఒక అమ్మాయి. కృష్ణమూర్తి జుబ్బా లేని అబ్బాయి, భజగోవిందం, కుకునం (వంట), క్లినసం (వంటపాత్రలు, ఇల్లు శుభ్రం చేయడం), స్లిపనం (సంసారం చేయడం), కననం (పిల్లల్ని కనడం) వంటి రచనలు చేశారు. తెలుగును సులభంగా నేర్పడం ఎలా అనే అంశంపై పరిశోధన చేశారు. సాహితీ స్రవంతి, సాహిత్య ప్రస్థానం తరపున గూటాల కృష్ణమూర్తికి జోహార్లు.

కోరికలు' అనే చక్కని తెలుగు పలుకుబడి ద్వారా నిరూపింపజేసే ప్రయత్నం గావించారు.

తమ లోపాల్ని గుర్తించకుండా ఎదుటి వారిమీద ఆంక్షలు పెట్టేవాళ్లు కుదురులేని కడవలాంటి వాళ్లని లోకజ్ఞానంతో కవి చెప్పిన తీరు బాగుంది. మనం గమ్యాన్ని చేరాలంటే తిన్నని దారులుండవని, మార్గాన్ని బట్టి పోతూనే ఉండాలి కాని తిన్నని దారి లేదని ఊరికినే కూర్చుకూడదనే పరోక్ష ప్రబోధంతో

**"ఏ దారీ/సరాసరి/చేర్చదు/గమ్యం/లెఫ్ట్/రైట్-లెఫ్ట్"** - అనే కవితను రచించారు. మనకు గమ్యం ముఖ్యమని దారి ఎలా ఉన్నా ప్రయత్నాన్ని వీడకూడదని ప్రబోధించారు.

కొంతమంది తమకు తెలియని విషయాన్ని గూర్చి వాదిస్తూ ఉంటారు. కేవలం ఊహలతోనే కాలం గడుపుతూ ఉంటారు. అలాంటి వారి ఆలోచనలకు వాస్తవాలకు నిలవవని చెబుతూ - **"ఆచారి/తానెరుగకున్నా/తన ఊహే/నిజమనుకుంటాడు/పొగను పేనితే/తాడవుతుందా?"** - అని ప్రశ్నించారు.

నిరాశావాదంతో బతకకూడదని, అలాంటి తత్వం ఉన్నవారి జీవితం అంధకార మవుతుందని హెచ్చరిస్తూ

**"ఎప్పుడూ/అపజయాన్నో/అశుభాన్నో/ఊహించే వాణ్ణేమనాలి?/బానిస/అంధుడే"** - అని చెప్పారు.

చెరుగ్గడలోని రసం వెంటనే అందదు. రసాన్ని అందుకోవాలంటే తొక్క తియ్యాలి. పళ్లతో నమలాలి. పిప్పిలోంచి రసాన్ని అందుకోవాలి. అలాగే ఈ రెక్కల్లోని చివరి రెండు పాదాల సారాన్ని అందిపుచ్చుకోవాలంటే కొంత ఆలోచనాత్మక ప్రతిభ కావాలి. ఒక రకంగా కొన్ని రెక్కలు మెదడుకు మేతను పెట్టేవేనని చెప్పవచ్చు. ఏదిఏమైనా రెక్కల్లో జీవన సత్యాల్ని ఆవిష్కరించిన సుగమ్‌బాబు అభినందనీయులు.

❋

## విదేశీ పదాలు - జాతీయాలు




**ఆర్కాట్ వెంకోబరావు**

వెల : 80/- పేజీలు: 93

ప్రతులకు : 8019859876

ఈ చిన్న పుస్తకంలో ప్రత్యేకంగా విదేశీ పదాలు, జాతీయాలు పొందుపరుస్తూ వాటిని సందర్భానుసారంగా ఎలా పలకాలో వాక్యానికి అనుగుణంగా ఎలా ఉపయోగించాలో చెప్పబడింది. ఆంగ్లభాష నేర్చుకునే విద్యార్థులకు, ఆంగ్లభాషపై పట్టు సంపాదించుకోవాలనే ఉద్దేశం ఉన్నవాళ్ళకి ఈ పుస్తకం చక్కగా ఉపయోగపడుతుంది.

**- ఆర్కాట్ వెంకోబరావు**

## కొన్ని రాత్రులు




**పుష్యమీ సాగర్**

వెల : 100/- పేజీలు: 94

పేరు ప్రఖ్యాతుల కోసం కవిత్వం రాసే కవులు ఈ సమాజానికి అక్కరలేదు. సమాజానికి పనికొచ్చే కవిత్వం, పాఠకుల స్థాయిని పెంచే కవిత్వం రాసేవాళ్ళు కావాలి! అలాంటి వారిలో పుష్యమీ సాగర్ ఒకడు కాగలడని నాకెందుకో నమ్మకం కలుగుతోంది.

**- డా॥ దేవరాజు మహారాజు**

## పిట్టకు ఆహ్వానం




**సుజాత పట్వారి**

వెల : 50/- పేజీలు: 80

ప్రతులకు : 9440927122

తన మనసును కదిలించిన ఏ అంశాన్నయినా అలవోకగా కవిత్వం చెయ్యగలదు సుజాత. ఏ ప్రత్యేక సందర్భంలో ఏం రాస్తే 'ప్రయోజనం' ఉంటుందోనన్న ప్రణాళిక లేమీ ఆమెకుండవు. ఆమెవైన ప్రత్యేకతలూ, పరిమితులూ స్పష్టంగా ప్రతిఫలించే అద్దం లాంటి కవిత్వం ఇది.

**- కాత్యాయని (చూపు)**

## నేలతల్లి పొత్తిళ్ళలో...




**ఐదైదుల ఇరవైయైదు**

**ఇనుగంటి జానకి, ఉప్పులూరి శైలజ, కొంకేపూడి అనురాధ, చోడవరపు వెంకటలక్ష్మి, చెళ్లపిళ్ళ శ్యామల**

వెల : 30/- పేజీలు: 36

ప్రతులకు : 9441176882

కవిత్వం ఒక ఆల్కెమీ... దాని రహస్యం కవికే తెలుసు' అంటాడు తిలక్. ఆ రహస్యాన్ని తెలుసుకునేందుకు మంచి ప్రయత్నంతో మనముందుకు వస్తున్న ఈ కవయిత్రుల కవిత్వంలో చాలాచోట్ల తాజాగా, తడితడిగా ఉన్న వాక్యాలు మనల్ని వెంటాడతాయి.

**- సాహితీస్రవంతి, విజయనగరం**

## ఐదు కలాలూ.. ఐదేసి కథలు




**గోటేటి లలితా శేఖర్, డా॥ ఎం.వి.జి. భువనేశ్వరరావు, నామని సుజనాదేవి, వడలి రాధాకృష్ణ, డా॥ తంగిరాల మీరా సుబ్రహ్మణ్యం**

వెల : 150/- పేజీలు: 200

ప్రతులకు : 9985336444

ఇలా జీవితంలోని వివిధ సందర్భాల, వివిధ వ్యక్తిత్వాల మంచి చెడ్డలను మనతో యీ కథలన్నీ పంచుకున్నాయి. అవి ఎంత శిల్ప పరమయిన సౌందర్యాన్ని ప్రదర్శించేయి, ఎంతటి ఉత్కంఠతను రేకెత్తించాయన్న విశ్లేషణ కంటే వీరి సామూహిక దీక్షకూ, జీవితానికి సంబంధించిన వీరి దృష్టి కోణానికీ మనం అభినందించాలి.

**- అట్టాడ అప్పల్నాయుడు**

## వింటిని గురిపెట్టు...




**ఆదివాసీ పోరు పాటలు**

**సంపాదకులు: నల్లెల్ల రాజయ్య**

వెల : 60/- పేజీలు: 64

నోరు తెరిచి అన్యాయాన్ని ప్రశ్నించటం, మారణ హోమాన్ని ఎదిరించటం, కలం పట్టి పోరాటం చేయడమే కదా మానవ ధర్మం. ధర్మం దహించుకు పోయిందనుకుంటే, పాపం పుణ్యం లేదనుకుంటే... బలవంతపు నిర్వాసితత్వం, నిర్బంధపు వలసలు, తల్లిపేగు తెంచి తరిమికొట్టడం లాంటి దురన్యాయాల పట్లనైనా సాటి మనిషిగా, హృదయం ద్రవించే కవిగా ప్రవర్తించవలసిన నిజ స్థితి ఇది కాదా...?

**- అనిశెట్టి రజిత**

# విజయనగరంలో కవిత్వ కార్యశాల




విజయనగరంలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జూన్ 26న జిల్లా పరిషత్ మందిరంలో కవిత్వశాల జరిగింది. ఈ కార్యక్రమం పది గంటలకు బేబి ప్రీతి పాటతో మొదలైంది. ఎస్.వి.ఆర్. కృష్ణారావు ఆహ్వానం పలికారు. చీకటి దివాకర్ కవి అంటే ఏ విధంగా ఉంటారో, కవులు ఏం చేస్తారో చెప్తూ శివారెడ్డి కవితలో కొంత భాగం వినిపించారు.

***"గోడలకు నోరిస్తారు, చెట్లకు కళ్ళిస్తారు***
***గాలికి గొంతిస్తారు, ప్రజలకు చేతులిస్తారు***
***తెల్ల కాగితానికి అనంత శక్తినిస్తారు"***

ఆ తరువాత అధ్యక్షులు అయిన గంటేడ గౌరునాయుడు ఒక చిన్న కథను చెప్పారు. ఒక చెట్టు కింద ఒక ముసలి అవ్వ కూర్చుని వుంటుంది. రోజూ ఆ అవ్వను ఇద్దరు పిల్లలు పాఠశాలకు వెళ్ళేటప్పుడు వచ్చేటప్పుడు చూస్తూ వుండేవారు. కాని వారికి ఎప్పుడూ ఆ అవ్వ మీద జాలి కలగలేదు. ఒక రోజు వాళ్ళ తరగతి గదిలో ఉపాధ్యాయుడు చెప్పిన శ్రీశ్రీ కవిత విన్న తరువాత ఆ పిల్లలు తల్లితండ్రులు చాక్లెట్‌లు కొనుక్కోవడానికి ఇచ్చిన డబ్బులు ఆ అవ్వకు ఇచ్చారు. కవిత్వం వినక ముందు చూపు ఒక విధంగా ఉంటే కవిత్వం విన్న తరువాత మనిషి ఆలోచనా విధానం ఇంకో విధంగా వుంటుందని పిల్లలకు చెప్పారు. ఆ తరువాత చాగంటి తులసి గంటేడ గౌరునాయుడు చెప్పిన ఉదాహరణ తీసుకొని మాట్లాడారు. ఆ కథలో ముసలమ్మకు డబ్బులు ఇవ్వడం కాదు. అలాటి ముసలమ్మలు కనిపించే సమాజం ఉండకూడదని చెప్పారు. యాపిల్ పండ్లు లాంటి బుగ్గలు వేసుకొని ఒక పాప కనిపిస్తే మీకు ఎలా అనిపిస్తుంది అని పిల్లల్ని అడిగారు. పిల్లలు అందరూ ముద్దుగా అనిపిస్తుంది అని చెప్పారు. అప్పుడు తన మీద మీకు ఉన్న ఇష్టాన్ని తెలియజేశారు కదా! అలాగే ఏదైనా జరిగిన సంఘటన చూసి తన అభిప్రాయాన్ని కవి కవిత్వం రూపంలో చెప్పుతారు అని చెప్పారు. పదండి తోసుకు... అని శ్రీశ్రీ అన్నారు అని చెప్పి, బాగా కవితలు రాసి మేము కూర్చున్న సీట్లలో మీరు కూర్చోవాలి అన్నారు. మేము ఈ కవిత్వ కార్యశాలలో ఉయ్యాల లూపడానికి వచ్చాం. మీరు ఉయ్యాలలూగే పనికి వచ్చారు అని చెప్పారు.

తరువాత రెడ్డి రామకృష్ణ మాట్లాడారు. ఒక పాట పాడారు. అత్తవారింటికి వెళిపోయిన తరువాత కన్నవారిపై ఉన్న ప్రేమను ఆ పాట ద్వారా పిల్లలకు తెలియజేసారు. ఆ తరువాత చంద్రశేఖర్ మాట్లాడారు. ఇతను శైలి, శిల్పం మొదలైన విషయాలను తెలియచేసారు. ఆ తరువాత పాయల మురళీకృష్ణ మాట్లాడారు. కవిత్వం మొదటగా రాసేటప్పుడు ఎవరు శైలి, శిల్పం, వస్తువు అని చూడకుండా రాస్తారు. తరువాత తెలుస్తుంది ఏది దేనికి వర్తిస్తుందని, తిలక్ రాసిన వెళ్ళిపోండి వెళ్ళిపోండి అనే కవిత్వం పాట రూపంలో పాడారు. బాల సుధాకర్ మౌళి మాట్లాడారు.

ఆ తరువాత పరిమళ మాట్లాడారు. తను చిన్నప్పటి నుంచి కవిత్వం రాసేదాన్నని చెప్పారు. కవికి కీర్తి మీద ఆశ వుండకూడదని, రాస్తూ పోతే అదే వస్తుంది అని చెప్పారు. గంటేడ గౌరునాయుడు రాసిన "పాడుదమా స్వేచ్ఛా గీతం" అనే పాట డప్పు శ్రీను పాడారు. ఒంటిగంటకు భోజనాలు జరిగాయి. 2 గంటలకు 8 గ్రూపులు వేశారు. గ్రూపులకు వేమన, ఆరుద్ర, గురజాడ, గరిమెళ్ళ అనే పేర్లు పెట్టి గ్రూపుకు ఇద్దరు కవులను ఇచ్చారు. అరగంట తరువాత వర్షం గురించి కవిత్వం రాయమని చెప్పారు. రాసాం. చివరిలో ఒక్కో గ్రూపు నుంచి మెంటర్లయిన కవులు ఆ గ్రూపులో విద్యార్థులు ఏం రాసారో తెలిపారు. బాగున్న కవితల్ని కోట్ చేసారు. ఎన్కె బాబు ఆలోచింపజేసే స్వీయ కవితను వినిపించారు. గౌరు నాయుడు ప్రసంగంతో కార్యశాల ముగిసింది

ఈ సాహితీ స్రవంతి కార్యశాల మాకు ఎంతో ఉత్తేజం కలిగించింది. ఇలాటి మరెన్నో కార్యక్రమాలకు మమ్మల్ని ఆహ్వానిస్తారని ఆశిస్తూ...

**- కింగం శ్రావణి, 10వ తరగతి,**
**జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, దేవుపల్లి**

# 'పెట్టుడు రెక్కలు' ఆవిష్కరణ



కర్నూలులోని కార్మిక కర్షక భవన్‌లో జూలై5న జరిగిన జంధ్యాల రఘుబాబు కథాసంపుటి 'పెట్టుడు రెక్కలు' ఆవిష్కరణ సభ. చిత్రంలో కె. శ్రీనివాసులు, వల్లభాపురం జనార్దన, జంధ్యాల రఘుబాబు, తెలకపల్లి రవి, కెంగార మోహన్, సింగమనేని నారాయణ, నాగమణి, రంగనాథ రామచంద్రరావు ఉన్నారు.

కర్నూలు నగరంలోని కార్మికకర్షకభవన్‌లో జూలై 5 సాయంత్రం సాహితీస్రవంతి రాష్ట్రకార్యదర్శి జంధ్యాల రఘుబాబు రాసిన పెట్టుడు రెక్కలు కథా సంపుటిని సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లిరవి ఆవిష్కరించారు. సాహితీస్రవంతి జిల్లాప్రధానకార్యదర్శి కెంగార మోహన్ సభాధ్యక్షులుగా వ్యవహరించారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన ప్రముఖ కథా రచయిత సింగమనేని నారాయణ మాట్లాడుతూ రాయలసీమ నుండి అనేక కథా సంపుటాలు వచ్చినా కర్నూలు కథకులకు అందులో స్థానం లభించలేదని, దానికి కారణం కథకుల కొరతేనన్నారు. ప్రస్తుతం పెట్టుడురెక్కలు కథా రచయిత ఆ సమస్యను పూరించాడనిపిస్తోందన్నారు. ఈ కథల్లో కర్నూలు ప్రజల జీవన చిత్రం ప్రతిబింబిస్తోందన్నారు. జిల్లా ప్రజల స్థితిగతులను చిత్రించడంలో రచయిత విజయం సాధించాడన్నారు. ఆవిష్కర్త, సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి మాట్లాడుతూ ప్రపంచీకరణ నేపథ్యంలో మానవజీవితాన్ని మార్కెట్టు శాసిస్తోందన్నారు. మానవ జీవితంలో ఆర్థిక, సామాజిక అంశాలతో సంబంధం లేని సాహిత్యం వ్యర్థమన్నారు. అన్ని అంశాలను క్రోడీకరిస్తూ పెట్టుడురెక్కలు కథాసంపుటి ఉందన్నారు. ప్రముఖకవి వల్లభాపురం జనార్ధన్ మాట్లాడుతూ రఘుబాబు కవిగా, కథకుడుగా, చురకసంహితను ప్రజాశక్తిలో సుదీర్ఘకాలం నిర్వహించిన ప్రముఖ రచయితగా ఆంధ్ర, తెలంగాణ రాష్ట్రాల్లో గుర్తింపు పొందిన రచయిత అని, కవిత్వం రాసినా కథలు రాసినా ఆయనదొక ప్రత్యేకశైలి అన్నారు. ప్రముఖ అనువాద రచయిత రంగనాథ రామచంద్రరావు మాట్లాడుతూ కర్నూలు కథకు ఎంతో చరిత్ర వుందని అన్నారు. సీమ ప్రాంతంనుండి ఇంకా కథలు విరివిగా రావాలని అలాగే పెట్టుడు రెక్కలు కథల సంపుటిలోని పది కథలు ఆలోచింపజేస్తాయన్నారు. ప్రముఖకవి ఇనాయతుల్లా మాట్లాడుతూ కర్నూలు కథా సాహిత్యం దినదినాభివృద్ధి చెందుతూనే వుందని, పెట్టుడు రెక్కలు కథల్లో నవ్యత ఆర్ద్రత, సామాజిక కోణం ప్రత్యేకాంశాలుగా కనబడతాయన్నారు. రచయిత్రి నాగమణి మాట్లాడుతూ రఘుబాబు గారి కథల్లో సామాజిక జీవనచిత్రం కనిపిస్తుందన్నారు. కర్నూలు యునైటెట్ ఇండియా ఇన్స్యూరెన్స్ సీనియర్ డివిజనల్‌మేనేజర్ కె.శ్రీనివాసులు మాట్లాడుతూ రఘుబాబు వృత్తిపట్ల ఎంత నిబద్ధత కలిగి వుంటారో సమాజం పట్ల అంతే నిబద్ధతగా వుంటారని, సాహిత్యం సమాజానికి చేరువయ్యేందుకు రఘుబాబు చేస్తున్న కృషి ప్రశంసనీయమన్నారు. అధ్యక్షోపన్యాసం చేసిన కెంగార మోహన్ మాట్లాడుతూ పెట్టుడు రెక్కలు కథలు



'పెట్టుడు రెక్కలు' కథాసంపుటిని ఆవిష్కరించి ప్రసంగిస్తున్న సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి

మానవీయకోణాన్ని, మనిషిలోని మనిషి తనాన్ని ఆవిష్కరిస్తాయన్నారు. ఈ కార్యక్రమంలో సిపియం పార్టీ సీనియర్ నాయకులు తెలకపల్లి నరసింహయ్య, జిల్లా కార్యదర్శి కె.ప్రభాకర్ రెడ్డి, జిల్లా నాయకులు జె.ఎన్.శేషయ్య. పి.ఎన్.యం నాయకులు యంపి బసవరాజు, ఆయా ప్రజాసంఘాల బాధ్యులు కవులు హీరాలాల్, జెయస్ఆర్కే శర్మ, అవుల బసప్ప, వియోగి, ఇన్సూరెన్స్ నాయకులు రఘుమోహన్, మదనపల్లె గ్రామీణ బ్యాంక్ మేనేజర్ తెలకపల్లి హరి తదితరులు పాల్గొన్నారు.

**- సాహితీస్రవంతి కర్నూలు.**



అనంతపురంలో జూలై 16న రఘువీరటవర్స్‌లోని ఆర్ఎం అకాడమిలో జిల్లా సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో జరిగిన 'యువతరం-ఆధునిక సాహిత్య అవసరం' సభలో ప్రసంగిస్తున్న ప్రముఖ కథా రచయిత సింగమనేని నారాయణ. చిత్రంలో వై. సూర్యనారాయణ రెడ్డి, రవిచంద్ర, రాంనాయక్, మహేష్



విజయవాడలో జూలై 17న మొగల్రాజపురంలోని చంద్ర రాజేశ్వరరావు గ్రంథాలయంలో సరసభారతి, రమ్యభారతి సంస్థల ఆధ్వర్యంలో జరిగిని 'మా అన్నయ్య' కవితా సంకలనం ఆవిష్కరణ సభ. చిత్రంలో విల్సన్‌రావు, ఆవిష్కర్త కాటూరి రవీంద్రత్రివిక్రమ్, గబ్బిట దుర్గాప్రసాద్, కె. ఆంజనేయకుమార్, సీతంరాజు మల్లిక.

## బి.వి.వి. ప్రసాద్‌కు తిలక్ అవార్డు



ప్రసిద్ధకవి దేవరకొండ బాలగంగాధర తిలక్ పేరిట పురస్కారాన్ని ఈ సంవత్సరం బి.వి.వి. ప్రసాద్‌కు ప్రకటించారు. గత ఇరవై సంవత్సరాలుగా తిలక్ మిత్రులు తంగిరాల సుబ్బారావు, శ్రీపాద కృష్ణమూర్తి ఈ పురస్కారాన్ని వచన కవిత్వం, పద్యం, కథ, నవల, నాటకం ప్రక్రియలలో ఒక ప్రక్రియకు ఇస్తున్నారు. హైకూలు, నీలో కొన్నిసార్లు, ఆకాశం కవితా సంపుటాలను బి.వి.వి. ప్రసాద్ వెలువరించారు. ఆగస్టు 14న తణుకులో ఈ పురస్కారాన్ని ప్రధానం చేయనున్నట్లు ఈ కార్యక్రమ నిర్వాహకులు తణుకు నన్నయ భట్టారకపీఠం కార్యదర్శి సుశర్మ ఒక ప్రకటనలో తెలియజేశారు.





హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞానకేంద్రంలో తెలంగాణా సాహితి ఆధ్వర్యంలో జూలై 22న జరిగిన గుర్రం జాషువా వర్ధంతి, దాశరథి కృష్ణమాచార్యుల జయంతి సభలో 'సాహిత్యం-ప్రగతిశీలత' అంశంపై ప్రసంగిస్తున్న కె. ఆనందాచారి. చిత్రంలో భూపతి వెంకటేశ్వర్లు, తంగిరాల చక్రవర్తి, సలీమా ఉన్నారు.

### సాహిత్య ప్రస్థానం చిరునామా మారింది

రచనలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా:
సాహిత్య ప్రస్థానం, 27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నరుపేట, విజయవాడ - 520002,
ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com,
www.prasthanam.com

### సాహిత్యప్రస్థానం పత్రిక చందా వివరాలు

1 సంవత్సర చందా రూ. 120/-,
5 సంవత్సరాల చందా రూ.500 /-,
10 సంవత్సరాల చందా రూ. 1000/-. చెక్కులు, డిడిలపై PRASTHANAM అని రాయగలరు.



కడప జిల్లా సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జూలై 24న నిర్వహించిన గుర్రం జాషువా వర్ధంతి సభ. చిత్రంలో జిల్లా పర్యాటక రంగ అభివృద్ధి సంస్థ గౌరవ అధ్యక్షులు సిద్ధపటం సీతారామయ్య, సాహితీస్రవంతి జిల్లా కన్వీనర్ మసాన్‌వలి, సిద్ధయ్య, డి. పద్మ, రాఘవ, నూర్‌బాషా, నాగార్జున, దుర్గాప్రసాద్, రవికుమార్, నరేంద్ర, మహావీర

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**





గిడుగు రామమూర్తి పంతులు

(29.08.1863-22.01.1940)

మగ్దూం మొహియుద్దీన్

(04.02.1908-24.08.1969)





ఆరుద్ర

(31.08.1925-04.06.1998)

దాశరథి రంగాచార్య

(24.08.1928 - 08.06.2015)



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO2A173 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేవి పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Kaveed |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |